ఓసఖా ! ప్రియభార్యాగ్రిమోఁగ మెఱుఁగ
నట్టి మోహపూర్వసత్కృతి ! యకట ! నీవు
కర్మశతకంబు చదువకు ! మర్మఘాతి
నీ వెఱుఁగలేవు దానిలోనిదగు —— .

# ఉత్క్రమణము

[ కృష్ణశతకము : ౧వ పది ]

నారాయణ! నారాయణ!
నారాయణ! దేవ! లోకనాథ! మురారీ!
నారాయణ! నారాయణ!
నారాయణ! కృష్ణ! విశ్వనాథ! ముకుందా!

నాకనుగూళ్ళలో నమరి నావగు కన్నులు చూచుచున్నవా!
నాకుటిలంపుమై నమరి నావగు ప్రాణము లాడుచున్నవా!
నా కని చెప్పుకోను దగినట్టిది వస్తువు నిల్చియున్నదా!
నాకృత మెల్ల నన్ను విడనాడక వెంబడి వచ్చుచున్నదా!

గ్రక్కున యామదండపరిఘాతముచే మఱి దేహమెల్ల ది
మ్మెక్కినదేమొ నా నెచటి వెచ్చట నచ్చటి వచ్చటే వోయిఁక
ద్రిక్కక నాదుప్రాణములు నిల్చెనొ తా నిది సూక్ష్మబాధ లే
కక్కట నాకు స్తంభవిషయంబుగఁ దోఁచెడు దేహమంతయున్

పోవుచు లేచి పోయినదిపో! మఱి మో తరుఁగొంటినో సరే!
ఆమనుకొన్నయంతయిన జానిని యిప్పటి కెన్నినాళ్ళబా
ధామతి యాతరించితిని యక్కట! యెవ్వరు లేనియట్లు నే
నే యయినాఁడ లక్ష్య మిడియించెను నేనపుగల్గు బ్రహ్మకున్

ఓయి! యదృష్టహీనుఁడ! అహో! ఎవ్వి చూడఁగరాదొ చూచినా
వోయి! అదే నిజమ్ముగ నెవో యొకయాశలు వేనవేలు, హా
హా! మొద పెంచికొంటి నవి యన్నియు చూచుచు యెట్లుసైనవో
నామొఱ లేము ప్రాణచలనంబున కింకను స్వస్తి చెప్పుదున్

గోతికిఁబోలె నున్న దిదిగో నను మీరలు పట్టుకొందు నే
పోతిని నేలలోనికి, దిగిపోయితిఁ, బోవుచునుంటి నన్ను మీ
రీతఱి బాధపెట్టకుఁడ యీగతి నాగతి నన్ను బోవనీ
కీతను వేల నిల్ప మది నెంచెద రాప్తులుగా సనాప్తులై

ఈనిమిసంబుదాఁక గ్రహియించకపోతిన యెంత కెంత శా
శానిహతుండ నైతిఁ గలుషంబులు సర్వము నేన చేసితిన్
వానిలువెల నగ్గి లలనా! దరికొల్పితి వాక్కలి ప్తులో
నే ననుభూతికిన్ దగుకు నెంతకు బ్రహ్మ యొఱింగి యేరెఁబో

ఇటు లోఁడలందు నంటుకొననీయదు బాధయటంచు మున్న దు
గ్ఘటమయినట్టి స్పర్శపుసుఖం బొనఁగూడెను దీనిదేహమం
తట శవ మందురా! యిది మదంబును పొందిన నాకుచేత మి
చ్చట శవదృష్టి పొందదునిజంబుగఁ బొందనిదేమొ పొందుచున్

ఈమెనురోమ్ముపై నొరిగి యే నది యెన్నిదినంబు లైనదో
ప్రేయములైన కోరికలు పెంచిన తొమ్మిదిమాసముల్ ఫల
శ్రీయుతముల్ పురస్కృతినిఁ జేకొనె నన్నిది వీడరానిదై
పాయనిదై సుగాఢముగఁ బట్టిన కౌఁగిలి నన్నుఁ దేల్చుచున్

నాకులాంగనయాననము చెక్కిలద్దనిం
డకట నన్నడ్డుపెట్టకుఁడు మీరు
నాప్రియురాలికంఠము కౌఁగిలించనిం
డీకరమ్ములు లాగఁబోకుఁ డీప
నాస్త్రీయురమ్ముపై నన్ వ్రాలనిండు వె
న్కకుఁ బట్టి నన్ను లాగకుఁడు మీరు
నాయర్ధతనువువెంటనె పోవుకొననిండు
వలదంచు నన్ను నాపకుఁడు మీరు

ఒక్కయోఁడాడిగ లేని యున్న దంచు
ముందు స్వర్గమ్ముగాఁ దలపోసికొన్న
చిరుకాశాసముద్రమ్ము లింకుకొన్న
చిత్తదిసుఖమ్ము నను( బొందనిండు నీవు

# ప్రాయశ్చిత్తము

[కన్నశతకము : తిసపది]

ఈయాచారముమాత్ర కాక మఱి యేవే మైథిలీశీల ! యీ
ప్రాయశ్చిత్తము నీ కవాచ్యములు పాపంబుల్ హరించున్ ద్విజుం
డాయుర్దాయము కొద్దిలోనె సురలోకారాధనీయాచ్ఛశీ
లా ! యత్యున్నత నీవు నోసి పతిశీలా ! నన్ను మన్నించవే

నీవు వేలుపుటూరి వేవెల్గు రేకవు
కేవలమును మృదాకృతిని నేను
నీవు సదాచారనిష్ఠాయతాత్మవు
కడు దురాచారనిష్ఠుఁడను నేను
నీవు నిశ్చలమనోభావాభిరామవు
సరి చంచలాతిచంచలుఁడ నేను
నీవు స్త్రీరూపమందిన గేహధర్మము
వాకరీతి కొదుగని యులిపి నేను

ప్రకృతి వశమ్మున్నగా నీవు వికృతి నేను
నా పౌరుష్య మహాఘపాతత్తులవడును
నేసుకృతిఫలమౌ నాయిల్లు నీవు
లీలగాఁ గొన్ని నాళ్ళు వెలిగించినావు

సుమసంవాసితముల్ సుఖాలయము తేజ్యోతిర్మయస్వస్తిలో
కములం దుండి వినిర్గమించితివో నాకై దివ్యపూతత్వాను
త్రమతాదర్శావకై త్యజించి నను నేతత్పూర్వయోగవ్యతి
క్రము నాశోకము లేగితే మదిల నిర్దాక్షిణ్యమూర్తింబలెన్

వ్రతసచేత నిన్ గొలువవచ్చును మానసవీధి దేవతా
మూర్తివి నీవు నాయెడలఁ బొందిన మానుషమైన ప్రేమ నా
కీర్తికి హేతువైన దతిశించిన యీయమ కింత త్రెంచి న
న్నార్తికి డించి పాపపు మంటితి నాయెదఁ జిచ్చుపెట్టుచున్

నీ విట దివ్యతేజములు నింపితి నేనెలు వార్చి తంతవై
దేవి! పరిత్యజించితివి దీనిని వ్యర్థశరీరమున్ బురా
శ్రీవివృతప్రభల్ గలపరించిన యియ్యది నేఁటి కింత తే
జోవిగతంబు నింత మధుశూన్యముగాఁ గనిపించు నేటికో !

నాయమృతప్రబోధచ్ఛటలు నిండిన వినివసంబుచేత నీ
కాయము షష్ఠ్యా మూత్సవనికాయము పూతచరిత్రుఁ జేసు నీ
మాయతిథస్థభావవిషయం బగుటన్ మఱి నేఁడు చూడు మీ
కాయము కట్టె నేను శోకకట్టెను రెంటను దగ్ధయోగ్యముల్

నీయండే నతిదోషకారి నది కానీ గోపలం దాచి యీ
ప్రాయశ్చిత్తము నాకుఁ జేసితివి తీరా సౌఖ్యమా వేళకున్
నాయావేశము చూడుమా బములు తేనా నీకు నేనున్ ఘట
ప్రాయశ్చిత్తము చేసెదన్ జివరి కర్మారంభనిష్ఠాత్ముఁడన్

తొలినాళ్ళన్ యజమానినై పసపు తెత్తున్ కుంకుమన్ దెత్తు చీ
రలు తెత్తున్ సకలమ్ము తెత్తును దరిద్రస్వామి నాసర్వమున్
వెలయింతున్ యజమానికిన్ బములు తెవ్వా! నేఁడు నిక్కమ్ముగాఁ
జెలి! నీ కేమటి భర్తనా! కొడుకునా! చిత్యగ్నికృద్వ్యక్తినా!

ప్రేమోరూపము దాల్చి వచ్చినది గౌరీదేవి నాయింటికిన్
నాయజ్ఞానముచేతఁ గొన్నిదినముల్ నాలేమిచేఁ గొన్నినా
ళ్లాయానందతరంగపూజలకుఁ గానైతిన్ జ్యోతాజ్ఞానుఁడై
శ్రీయుక్తుం డయినంతలోఁ గుపిత చేరెన్ గౌరి కైలాసమున్

ఛద్మాకారము పూని దేవత లుదంచత్ప్రేములై మానవుల్
సద్మంబుల్ మఱి సేవత్తురు తిరస్కారమ్ము విజ్ఞానసం
పద్మత్తుల్ పొనరింత్రు వారిదెస దౌర్భాగ్యుల్ మనుష్యుల్ క్రుధా
సద్ముల్ సౌరపథానుగుల్ సురలుధీప్రసంసుల్ హాతుల్ మానవుల్

# దహనము

[కర్మశతకము : 3 వ పది]

నిశలును బవళ్ళు సుఖము పండించుకొన్న
నాపొలము భగ్గుమన్న మంటఁ బడిపోయె
నవిలజనమున సురసుర లాడిపోయె
మంటవెల్లువ మలమల మాడిపోయె

ఇది యొకనాఁడు సోగతీన మేచిన ప్రేమమనోజ్ఞదీపికా
మృదులవిచిత్రవీథితులు మించిన సంసృతిదుఃఖభార మె
ల్లఁ దిగిచి దివ్యసౌఖ్యములు లాదిన మోహానసౌధ మిప్పు డి
య్యది చితివహ్నిలోఁ జిటపెటారవభీకర మయ్యె నేఁటికో !

మూఁడుబాసలలోని ముగ్ధభావము లేరి
కొని తెచ్చికొని దాచికొనిన చోటు
అల దిశాంగనల నీహారార్ద్రవాయువీ
చికలలో సొగసు తేల్చికొను చోటు

పూర్వజన్మసంస్కారపరిణామపరిణాహ
వహించి కౌఁగిటఁ బూనినట్టిచోటు
నాతనూస్పృష్టిలగ్నాఖిలాణువులలో
నమృతసేచన చేసినట్టి చోటు

కోరి పితరు లాశలు పెంచుకొన్న చోటు
నా సగోత్రులు మరియాద నాటు చోటు
నాకు నిలువేల్పు లభిలాష ననచు చోటు
ఈగతిఁ జితాగ్నిభస్మమై యేల పోవు ?

ఇచటఁ దర్పితులై నవేప్సితంబులు గన్న
పితరు లెంత కృతఘ్నమతులో కాని
ఇచటఁ బూజితులైన యిలువేల్పుల సమూహ
మయయో తా నెంతనిర్దయమొ కాని
ఇట సమర్చాప్రీతి నెసఁగి దీవన లిచ్చు
ద్విజకోటిమన సెంత బిరుసో కాని
నాపూర్వజన్మపుణ్యం బెంత యల్పమై
నదియో హీనాతిహీనంబో కాని

నాకనుల నెట్టయెదుటన నాశరీర
వామ వామార్ధమైన యాభాగ మెల్ల
పెడపెడ దహించికొనిపోన మిడిసిపడెడు
స్రుల్లు పెట్టుక నేఁ జూచుకొంచు నుంటి

ఇది నిన్నదాఁక నాయెదమీఁద హత్తించు
కొనినట్టి మందారకుసుమమాల
ఇది యింతదాక నాహృదయసంగతమహా
నందనిర్ఝరిణీకనత్తరంగ
ఇది నేఁటిదాక నామదిలోన వెలిఁగిన
దీపించి నా మృతదీపకళిక
ఇది యింతవఱకు నాయీమైగగుర్పాటు
కాంచిన చల్లని గాలితోవ

ఈచితావహ్ని ఘోరజిహ్వికల చేత
నాకఁబడి రేకులను జీలినదియు బిందు
వితతి శోషించినదియు దీప్తిని లయించి
నదియు శైత్యంబు హరియించినదియు నయ్యో

ప్రాలేయగిరిసుతాఫాలకుంకుమరేఖ
రాణించు శుక్రవారవ్రతంబు
నానావయవఘట్టనముల గూర్చిన ద్వాద
శాదిత్యకృతనమస్కారనియతి
గాయత్రితోఁ బాటుగాఁ జూచుకొన్న సాం
గకనవగ్రహపురస్కారనిష
బ్రహ్మార్పణంబుగాఁ బ్రతికార్యమందు పూ
నిన సర్వదైవసన్నిహితబుద్ధి

కేవలము మత్పురాజన్మకృతమహాఘ
బలమునకె లొంగిపోయె నాబలము బుస్సు
మన్న త్రాచుల నాల్కలకన్నఁ గ్రూర
ఫణితిగల యీచితాగ్నిరూపంబు తాల్చె.

తనప్రేమలోతు చిక్కని దృగంతచ్ఛటా
శ్రీఁగాని నోటితోఁ జెప్పలేదు
తనదుఃఖభార మెల్లను నిశ్చలాపాంగ
ములఁగాని నాల్కతోఁ బలుకలేదు

నాపైన ద్వేషసంతతి చెప్పవాల్చుట
నేఁగాని జిహ్వాగ్రోఁ జొరకలేదు
తనమహాగంధ మింతని పూపుఁ దళతళ
గాలికిగాని మాట నూదలేదు

ఈమె యోగిని కనులంటె యెల్ల బ్రదుకు
బ్రదికెఁ గనులందె పాపముల్ వదలిపెట్టె
ఆకనులనే పైకె హోమము యగ్ని యిట్లు
ఆజ్వాలజిహ్వా వెంపగలాడుచుండె

కూటికి లేక చిక్కులుపడ్డనాళ్ళలో
నీ మేను నిలిపిన దీమెకాఅకు
అతిని యోగపుముష్టి నఖిలమిత్రుల ధనం
బెదఁ ఘుంది కానినది యీమెకాఅకు
అన్నిసార్లాత్మమాహాత్మ్యబుద్ధి పెడఁద్రోసి
యిలమీఁద బ్రదికిన దీమెకాఅకు
గదపూర్ణమైన నాకాయంబు బహుయత్న
మేని రక్షించిన దీమెకాఅకు

ఇపు డెవరికోసమో కాని యేను బ్రదికి
యుండు టవు నవు నాపిల్ల లుండినారు
వారు నాప్రాణములయందు బిల్లు లట్టు
లదుముకొన్నారు నాచావు నడ్డపెట్టి

మనసువికారమెల్లను నాకె కల దట్టి
నన్ను సమ్యక్ఖిలు తెన్ను నడపి
లక్ష్మి నాయెడఁ జంచలాతిచంచల యట్టి
నాయిల్లు భాగ్యవంతంబు చేసి
• వట్టిసీరసబుద్ధి నట్టినన్ను గసోత్థ
పథముల సత్కవీశ్వరునిఁ జేసి
గదపూర్ణదేహు న న్నాద నాఁది నాకు ని
ర్గమన కారోగ్యభాగ్యంబు నొసఁగి

ఇతరు లెవ్వరు నెఱుఁగని యీరహాస్య
ఫణితి నను నేలుకొనిన నాపట్టమహిషి
నిర్దయునిచేత నాచేత నిహత యయ్యె
అనిలముఖమున స్పృష్టఘోరాఘుచేత

సామానుష్యగాత్రమునకిది జిహ్వాలు చాచు
వాసనకునకికి జోహారు లనుము

కృషిలభ్యము పుణ్యకృత్యఫలము కోరు
భూతినాథున కిన్ని జోత లనుము

దానాదివాంఛారతాపబుద్ధికి బ్రాహ్మ
ణశ్రేణి కొక్క ప్రణామ మనుము

అత్యల్పమును గాని తమకు ధన మ్మాసించు
చండాలతతికి కొక్కదండ మనుము

ఈగ్లశాస్త్రాయసమృద్ధిగునర
సంతతికి నొక్క వే నమస్కార మనుము
ఎవివితరిపు పాణిసమూహమా! పు
నఃపునఃప్రణామము పూనినాడ మీకు

# సంచయనము

[ కర్మశతకము : రవపది ]

ధ్యానించుచున్న గాయత్రీమహాదేవి
యష్టరాధమున నెత్తి నఱచినట్లు
పూనియున్నవ్రతంబు పూన్కి భగ్నము చేసి
కాన శనైశ్చరుఁ డాఁచి కొట్టినట్లు
అసదుపస్థితుఁడు మార్తాండదేవుఁడు నన్ను
నీనాస్తికుని విగ్రహించినట్లు
తల్లి యపర్ణ విత్తక్రీతభూదేవ
తాపూజలను గాలఁ దన్నినట్లు

అణఁగిపోయితి గిలగిల లాడిపోతి
లొంగిపోతిని దల పగులంగఁబడితిఁ
బంచభూతములార! యీప్రాణమున్న
శవము చూచితిరే యెట్లు సాఁగుచుండె

ఒకనాఁడాతనుగూర్చి ప్రశ్న యిడ నే నో తన్వీ! నే చచ్చిపో
నకటా! నీవును జచ్చిపోయెదవఁటే యన్నన్ నిశాతంబునై
చకితంబై చను చూపు చూచినది లజ్జాహీనుఁడన్ నేన యూ
రక ప్రాణంబులు మోయుచుంటి బహుభారంబైన యీమేనితో

ఈచండాలుఁడు నీళ్ళు చల్లుకొని నీయీప్రేతవహ్నిచ్ఛటల్
వే చల్లార్చక బొగ్గు లెత్తికొని నిర్భీతిన్ జనన్ నే సుఖ
శ్రీచండాలుఁడ నింటి కేగి నిశ నిద్రించన్ చితారక్షణం
బాచారం బెటు సాఁగు నిప్పటికి నీయందే నరత్నౌమతిన్

ఏమో నాయొక ప్రేమ సన్నగిలినట్లే యెంచుచున్ నీకు మం
దో మాకో యెదియేని నే నొసఁగనైతిన్ దోసంబు నాటెంతు నే
నేమో నీ కళలమ్మునై నగతి నట్లే నీమన స్తృప్తిగా
నీమై నీతుదికర్మ చేసెదన తన్వీ! చేతులారంగనై

తల కొరివి పెట్టి రక్కరింపులకు నీవు
బ్రతికియున్నప్డు చాలనిభర్త యితఁడు
తల కొరివి పెట్టి రక్కరింపులకు నేల
బాసినప్పుడు చాలిన భర్త నేను

చెల్లఁగనీక యసుఖము చింతలు బాధలు పెట్టిపెట్టి నే
నెల్ల విధంబులన్ బాయక యేరితి పాపము క్రోధ పొంది నీ
వల్లను కూరి నే బ్రతికియున్న దినంబుల నేను దుఃఖినై
యెల్ల విధంబులన్ బాయక లేకుచునుంటిని నిక్కనంబుగాన్

క్రిము పొందువేళ విశ్రాంతి నాజన్మపై
నాఁచిన దిది తలంపోని బామిక

సక్రమకపముగ నతు మాన్ని నానమ్ము
క్రోవిస దిది మొహజన్మనెమ్మ

సుఖకార్యమునకు భాసురసంబాహుల్య.
యీరాజిత నిస్సది మొముకదోయి

సంవాహనా తల్లజాముగ్ధ మూరుద్వ
యంబులోనిది యిది యస్థియుగము

అసుఖానేహములఁ బోల్చనైతి వీనిఁ
గుపితవై యెంత తరిమించుఁ గొంచు వచ్చె
అంతులేని మహావ్యాధి నాశ్రయించి
సాగి నామెట్టయెదుట సాక్షాత్కరించె

విజ్ఞానాస్థిపయంబు ని న్నడఁగఁగా నిండింపుకోనైన నం
తర్జ్ఞాపూమధుభాన మేఁచుకొనునైన మానసమజ్జాస్ఫురం
తిజ్జృంభోల్బణ మయూని నాను నయనాంతప్లావితప్రౌఢి జ్యో
తిర్జన్మాకృతి తాల్చి శుష్క పలితాస్థీ ! దగ్ధబీజాకృతీ ! ?

పరిశ్రాంతాస్మ్యుదారహృద్రుధిరధారాసంప్లవస్నాత్రైవై
ఁద్రసుప్తాళితమూ త్రైవై క్షణములో నాశానిరాశాద్వయీ
సశ్రద్ధానుతిచేతు నీ మదభిలాషానద్విశుష్యద్ఘనా
స్థి ! శ్రీభైరవకాలరుద్రగతవాసీ ! దగ్ధజీవాకృతీ !

నీపయి మాంస మూయెడన నెత్తురు నాపయి నేదొ యేదియో
ఆపయిఁ జన్మ మెట్టు లయినట్టిది నాప్రియురాలివేను స్మ
వీపలితాస్థి వల్లపగమేశ్వరకంఠవిభూషవాది నా
హా ! పరివాంచితక్రియకు నైతివి సాయము మొండిబ్రహ్మకున్

# నిత్యకర్మ

(కన్మశాకము : శివపది)

ముదిసి మూఁడారుపదియేండ్లు బ్రదికి చచ్చి
సట్టివారికే కాకులు ముట్ట వచ్చును,
మూఁడుపదియేండ్లు నిన్ననో మొన్న నిండె
ముసరి కాకులు నెగబడి ముట్టు నీకు

బ్రదికినవాళ్ళనైన తెరవా! అతినిర్మమురాల వీవు, నా
కిది వలె నంచు నా తెరచి యెన్నఁడు కోరఁగ లేద నన్ను, మీ
కెది మఱి యిష్టమో అదియె యిష్టము నాకని సర్వవాంఛ లో-
నదిమితి నేనై మిగులునట్లుగఁ జేసితి వప్పు డిప్పుడున్

తీరనికోర్కిఁ బిల్లువ గతించిన ప్రేతము పంగువామునా
కారము గాఢనీలతనుకాంతియుఁగా నొకనాం కెకట్టిలో
దూరముగాఁగఁ బత్తులను తోలునఁటా ముఃతీరు లేని నీ
తీరినయెల్లకోరికల తీఁనితీరుట యెట్లు కల్గెనో ?

అతిబాధాపరిఖిన్నదేహనయి లేదా నాకు మీఁపైన, లే
నతిగాఁ బల్లలపైన, బాధపడలే నానందమే పొందెదన్
స్మృతి ప్రాప్తించిన నంటి, నాపలుకులో మేలైన నీకుండె నా
దితి బాధన్ బడలేకయుంటి నను కొంటన్ నేను మూఢుండనై

ఈయనవమానసంతతులు, నిట్టిస్మృహాగమనంబు, నిట్టిబా
ధాయతి యేల యీయడవి కైనను బోద నటన్నఁ బోద మా
నీయతికష్ట మెంతని సహించెద రిచ్చట నున్నయన్ని నా
శ్రేయసమాన మున్నయదియే యని తూఁగితి నెంత కంతకున్

నాజనకుండు చేసిన ఋణంబు చరాస్థిరాస్తి మ్రింగి నీ
నాజనయిత్రి మైనగలు నాశముఁ జేసెఁ బదారువర్షముల్
లేజవరాల వాక్కనగ లేకయు లేదను మాట లేక యా
హా! జరిగించితా దినములన్నియు నిమ్మురాలవే సదా

ఏ నలపేదవారలకు నిచ్చిన దీయక యిచ్చుచుండఁగా
లేనిది లేద, యున్నయొకలేశములో నిటుపేదవారికి
నే నిజ మీవలెన్, గలవియే యని. తిన్నది కాదు, వేదచూ
డానతబుద్ధి పట్టు లనుటల్ స్మృతి వచ్చెడునే ప్రియాంగనా!

వెలఁగల చీర లేదు, పతివెట్టిన సొమ్ములు లేవు, తల్లిదం
డ్రులు గొనిపోయి యిచ్చినవి రూకయు లే, డవి లేనటంచు నీ
వలయవు, నేను దుఃఖపడినప్పుడు శాశ్వతమౌ ధనంబు వీ
రలు కల రంటి వన్నిటికి రా! అది యోగిని మాట చెప్పకే

తా గృధ్రం బిటివో శ్మశానబలిమీఁదన్ గాని కూర్చుండ, దం
డేగాని తిన, దాడనీయ దొకరీతిన్ వాయసశ్రేణికన్
రాగాపేత, త్రయీశిఖాపరిణతాగ్ధన్యక్తవిత్తాబ్జ ఆ
నాగేహోందిన తృప్తిలేక ద్విజసంతానంబు భక్షింపుమా!

నాసాగ్రమ్ములకన్నఁ బాగ్రిమగు ఘాంతం బెచ్చి హాహా! శ్మశా
న ప్రేతాకృతి గృధ్రవాయసముఖాంధఃప్రాశనం జేసి ప
క్షి ప్రాశమ్మున నా మొసద్గుణములన్ జింతించు చే నుంటిగా
నీ ప్రాణాధికతోడఁ బోవు టెఱుఁగన్ నే నెంత రక్షోమతిన్

# సపిండీకరణము

[ కన్నశతకము : ఉపపది ]

రాష్ట్రంబు లేలని రాజులు మహాప్రభు
లారాజులకు రాజు లైనవారు
నిత్యాన్నదాత లాదొరలు వారిండ్లలో
నట్ట నన్నపూర్ణ లైనట్టివారు
ఏకచక్రాంకితు లేకభోగులు వార
లాయింద్రులకు శచు లైనవారు
సతతదానక్రియారతికాకృతులు వార
లవ్వారి కదలిక లైనవారు

మాపితామహియుం, బ్రపితామహియు, జ్ఞాత
నామమాత్ర మాప్రప్రపితామహియును
దివ్యలు వసురుద్రాదిత్యభవ్యరూప
లరుగుదెంచి రీద్వాదశాహమ్ము వేళ

ప్రప్రపితామహీ విధునభానముగాఁ దంపోయుచూపిఁగా
ని ప్రకటంబు గాదు కమనీయభవద్గుణశీలవైభవ
శ్రీ, ప్రభవిష్ణుతాఖనివి చెల్లరె ప్రప్రపితామహుండు భా
గ్యప్రభు వెట్టు లయ్యె మఱి యాతఁటిదానవు నీవు కానిచో

ఓ ప్రపితామహీ! జనకుఁ డోరిమి నీకథ లెన్ని చెప్పెనో
అప్రఘులైన జ్ఞాతుల కురంతపుచేఁతలు ప్రోచి పుత్రులన్
దీప్రగుణాఢ్యులన్ గడనుఁ దెచ్చితి వాస్తులు నిల్పి వంశగా
థా ప్రకటీకృతాఖిలకథాగత! మాదుయశస్తరంగవున్

రువ్రానిత్యమహానుభావతనువున్ ద్రోపాడి మీరిర్వురున్
భద్రాకారము లూని స్వర్గపురిలోఁ బాలించఁగాఁ బొందు నా
షుప్రిమ్నే సాతిశక్తి నిచ్చెదవు గైకో స్వర్గపాథేయ మా
పద్రిషాప్రిషు లీను నాయెడల నైపంజూడు డీలోపమున్

ఆ తేజమ్ములు పిండభాగముల నీయం దావిరాసంబులై
నీతీవ్రోకుతపంబు చేత సుషమానిష్ఠాతముల్ వచ్చి మ
చ్చేతోదుఃఖమునందు నింత కుదియించెన్ గొంతనున్ గొంత నీ
పాతివ్రత్యమహత్త్వ మిట్టిదకదే పర్యాప్తమై పొల్పెడిన్

ఈవిఁగిలినామె మాకుఁపితామహి తన
జీవితముగూడఁ ద్యజియించేఁ జిన్ననాఁటి
నాచదువుకోసముగను మానాయనమ్మ
శ్రీతరుగువోని యానాఁటి చివరిరాణి

మాయక్కగారల మరపించి పసినాఁడు
వెన్నలు పెట్టి మేపినది నన్ను
అనుదినమ్మును బుష్టి నర్థించి చల్ల చే
సిన చేతిజిడ్డు రాచినది నాకు

తనపెద్దకొడుకుసంతానమ్ము చిరలబ్ధ
మని వేయికనుల కాఁచినది నన్ను

నాకునై గుంటగుంటల నీరు ద్రావి క
ష్టా లెన్నియేని పడ్డది భృశమ్ము

నాకుఁగానె ప్రాణము వీడినదియుఁగూడఁ
దుదకు నే చాలనాళ్లు లాముని మొగమ్ము
మరచిపోలేదు నేఁడు ప్రమాదపడితి
నేండ్లతో స్మృతిశక్తి బాహిరము పోయి

# గోదానము

[కర్మశతకము : ౭వపది]

అగ్నిమయ సుస్మృతమయ మఘు
మగ్నులకు సముద్ధరణము మంథానము ని
త్యాగ్నుల సుకృతంపుఁగడలికి
ప్రాగ్నతిసుత్పుణ్యారాశి పండిన దిట్టై

ఇది యాదిగోవృఎలె ను.
స్నది కృష్ణునిచరణముద్ర నాటిన దీయా
నుదురందు రాఘసవతికిఁ
బదనగు చూపులను గనుఁబట్టెను దుపలక్

గోలోకమునుండి సనా
శ్రీలాంఛనమూర్తి నీదు సేవాలోల
ప్రాలేయశశిగకరుణా
వ్యాలంబిమనస్క యగుచు వచ్చిన దిటకుక్

ఈ నాపురాక్రీణతైజఃప్రభేవదీ
ప్తాకీర్ణనీపరిపూతమూర్తి
యీగోవు పుట్టిన దెచటనో పెరిగిన
దెచటనో యింక తా నిద్విజునకుఁ
గైవసమై పెంచఁగాఁబడు నెచటనో
బ్రదుకులోపలి పుణ్యభావ మెల్ల
ఒక్క యీయూను మేమో మనదై మన
కర్పించి చనుచున్న దనఘమూర్తి

తన బ్రదుకు నెల్లఁ గడపిన జనుల కేమొ,
పట్టి శాశ్వతమైన సంపత్తు నొసఁగి
మన తన పురాతనంపు సంబంధ మేమొ
తన బ్రదుకులోని పరమార్థ మదియె నీకు

ఈనతపుణ్యమూర్తి కృపయొత్తిన వేలుపుఁ బల్లపూళ్ళ మా
గానిపొలంబు పంట కొదుగక నెళమైనదివోలె నెంత పు
ణ్యానికి నైతినో కృతమహాఘపరంపరమధ్య వచ్చి త
న్వీ! నిలుచుండె వేలుపులనేలకు నిచ్చెనఁ బట్టినట్లుగన్

అతులము పున్నె మొగ్గలిగలినట్లుగ ముంగిట నిల్చియున్న స
న్నుతి శ్రీలిచూలుపెయ్య నొకమాదిరిగా ననరాకుగాని నీ
బ్రతికినన్నాళ్ళు నాసుఖము పండిననాళ్ళ పవిత్రమైన నీ
వితరణబుద్ధి వైతరణిబెట్టిద మూగగజాలదా! సఖీ!

అమృతము నిగ్గు మై వెసగు నా విధి దానపు నేటిచుక్క పు
చ్చు మనుసరింప యీవ్రజాడు చాచిన చేతికి నందలేద వే
గముపడమంచె వైతరణిగట్టులు దూకగబోవునట్లు నీ
విమలతరంపు శీలమది వింతవె యెంతటిప్రాప్తికేనియున్

పడతీ! నాసుకృతంబు పండినది యీప్రష్ఠాహిగా నీకు నా
కడసారిన్ బొనరించు సేవ యిదిగో కైకోవె ప్రేతార్థ్యమున్
బడి పర్వెత్తెను నావదిన్ బడనయి పాలించు నీతల్లి నిన్
వడి నాయూహాలు చీని కెత్తు తెరచాపల్ కన్నచుక్కానిగన్

నా బ్రతుకనంటి బ్రతుకు లంతములు లేవి
వెన్నియైనను బ్రతికి మ జేమిఫలము
ప్రకృతిపరపూత యీయావుబ్రదుకు బ్రదుకు
వంధ్యశీలవు నీదైన బ్రదుకు బ్రదుకు

కదలు వెనుగాళ్లు లూఁగు తోఁకయును చలిత
రమ్యపృష్ఠంబు నూఁగెడు శ్రవణములయు
శృంగములయు కొఁసల్ కనిపించుమూర్తి
తరలుచున్నది యీఁమె వైతరణి దాటి

# గౌరీపూజ

[కర్మశతకము : చవపది]

ఉన్నదే యువతు లాకున్నయందఱు ఫాల
బాలనీహారాంశుపలితబింబ
లున్నదే వెలుఁగు లాదున్నవన్నియు విడా
విభృతపింగళమధ్యనిర్గమములు
ఉన్నదే మహిమ లందున్నవన్నియుఁ ద్రిలో
కనపుసిక్రియాసమాకర్షణములు
ఉన్నదే వినతు లందున్నవన్నియు విశ్వ
నాథనీరజచరణార్పితములు

ప్రళయరహితగౌరీలోకములు శివాన
పీనపాదవిన్యాసలాక్షానతాంక
కృతనవాలంకృతులు నీకుఁ గేవలముగ
లలితవిహారణవాసభూములుగ నగుత!

అవిదితమైన వాయువులు నిరుద్ధని
శ్వాసనిర్వాతనైశ్చల్యవిధులు
అవిదితమైన క్రొంబువ్వుతావు లాఘ్రా
ప్యాంతవేద్యు లపార్థివములు
అవిదితమైన ధ్వనివిశేషములు బ్ర
హ్మకపాలరుద్ధానిలాగతములు
అవిదితమైనట్టి యాకృతు లతిదృష్టి
లాజృంభము లతీతతైజసములు

ప్రణయాహితశాఖీలోకములు నచంద్ర
మఃశిశిరచారుచంద్రికామంథరప్ర
శాంతకాంతిమంతమ్ము లచ్చముగ నీకు
లలితవిహారణావాసభూములుగ నగుత !

అట నాశ లేదున్నయది వినాశావిష
యంబు నిస్త్రైగుణ్యామృతమయము
అట బాధ లేదున్నయది పాంచభౌతికం
బది మేను సహజబాధావహంబు

అట్టి మహా శే కున్న యది యనూహాత్మకం
జ్ఞానానవిషయ మనాదిలయము
అట్టి లేమి లే మున్నయది యందు కలదా న
షేక్షుచే నెచటో కల్పించినయది

ప్రళయరహితగాఢంగోకములు సనాత
నములు సచ్చిదానందవాటములు భర్త్రు
జనమనోఽభిరామానివాసములు నీకు
లలితవిహారణవాసభూములుగ నగుత!

అడుగడుగుకుఁ జివురాకు లూచిన గాలి
వడి వేదశిఖ లూను కడిమి చెట్లు
చెట్లుచెట్లున నీడపట్లులందున ఫాల
చంద్రనుపలు శివాసదృశసతులు
సతిసతివాక్కున శ్రుతిమహార్థాముగ
వ్యాఖ్యానములు గౌరివైభవములు
ప్రతివైభమున నేత్రనిమీలనములు హ్రా
త్పద్మవికాసముల్ తన్మయతలు

ప్రళయసంహితగాఢశోకములు సమార్ద్ర
మసృణహారిద్రమృగాకుంకుమపరిలిప్త
సర్వశృంగాటకమ్ము లచ్చముగ నీకు
లలితవిహరణవాసభూములుగ నగుత!

ఉష్ణశీతాంశుల యుదయాస్తములతోడ
నైన కాలవిభాగ మందు లేదు
ప్రాక్పశ్చిమాదికవ్యవహారనిర్దిష్ట
మైన దేశవిభాగ మందు లేదు
సత్కర్మనిత్యాదికించిత్కర్మ్యపార్థవా
క్యముల మిథ్యాచర్చ లందు లేవు
విషయవిషయ్యాది వేద్యాదిదృగ్దృశ్య
ద్రష్ట్రాదికములు భేదములు లేవు

ప్రళయసంహితగాఢలోకములు గుణప్ర
హీణములు సత్ప్రధాననిర్వాణములు ని
శాతబ్రహ్మలయమ్ము లచ్చముగ నీకు
లలితవిహరణవాసభూములుగ నగుత !

మొరసినట్టిది యందు మొరసినట్లే యుండుఁ
గూనతుమ్మెద రొదవోని యులివు

కురిసినట్టిది యందుఁ గురిసినట్లే యుండుఁ
గరి తేఁతనుంచుతుంగపురుఁల జల్లు

సాగినట్టిది యందు సాగినట్లే యుండు
గాజువారిన సన్నజాజితావి

కాసినట్టిది యందుఁ గాసినట్లే యుండుఁ
దెలిదిక్కునైన చందిరుని వెలుఁగు

ప్రళయరహితగౌరీలోకములు బెడంగు
లోలయు తలరింపుకల తోలివెలుఁగు సాఁగి
చాలుకట్టిన మేలిపాలాలు నీకు
లలితవిహారణవాసభూములుగ నగుత!

అట జన్మజన్మాంతరాజ్ఞానకృతఘోర
లీనపాపములు జల్లించినట్లు
అట నకారణఫలావాప్తికందిన మహా
నేకపుణ్యములు పండించినట్లు

అట నైకదైహికోద్భవదుఃఖపరిణామ
విధి చేతితోఁ దీసివేసినట్లు
అట సచ్చిదానందమైన బ్రహ్మము నిరా
దృతమాయచేఁ గన్ను తెఱచినట్లు

పరిశయగహితగాంగేయలోకములు విధూత
జామబోపాత్తదుఃఖవాసనలు కమల
మృదుపవనవీచిచలనసంపదలు నీకు
లలితవిహారణవాసభూములుగ నగుత!

అచటి శుద్ధశ్వాసనిచయంబులందుండి
అల్పలోకప్రళయములు కలుగు
అచటి ముక్తశ్వాసనిచయంబులందుండి
అల్పలోకపు సృష్టి లంఘించు
అచటి నేత్రనిమీలనానందములనుండి
భువనముల్ మోక్షాధ్వములు గమించు
అచటి లీలామోహనాపాంగములనుండి
భువనంబు లజ్ఞానమున నెసంగుఁ

బ్రిళయగహితగౌరీలోకములు సమస్త
భువనతతిసృష్టిలయహేతుభూతములు వి
శ్వసంఘోరాఘనస్తమోక్షములు నీకు
లలితవిహారణావాసభూములుగ నగుత!

అవికారము వికారగ మచటి తుమ్మెదమోహిత
కేలిక యగు తొలినెమ్మొద్దులంకె
అవిభిన్నము నభిన్న నుచటి గౌరీమూర్తి
కాదిశివాకారమైన జ్యోతి
అద్వైతమును ద్వైత మానిశ్వసంబుల
కల ధర్మమూల మైనట్టి విద్య
అవియుక్తము వియుక్త మాచోటున కతివి
చిత్రిమా వైధసస్పృష్టి యెల్ల (

బ్రిళయగహితగౌరీలోకములు విలీన
వృక్షబీజవత్తత్కృత్స్నసృష్టిగర్భి
తాచ్ఛవిజ్ఞానమయము లందములు నీకు
లలితవిహారణావాసభూములుగ నగుత!

నిత్యసౌమంగల్యవిభృతమూర్తిని నిన్నుఁ
పాలించుఁగాక సౌభాగ్యగౌరి

అతిలోకదివ్యశీలాభినందిత నిన్ను
లాలించుఁగాక కళ్యాణగౌరి

అమితనిర్మమురాలవైన నీమనసులో
నటియించుఁగాక ఆనందగౌరి

విమలాచ్ఛవిజ్ఞానవీథిలోపల నిన్ను
రూపించుఁగాక చిద్రూపగౌరి

మద్వియోగవ్యథాదూయమానహృదయ
నీరజను భవ తనయాకుమారరక్ష
ణాతురమనోంబుజాతను నాదరించి
యాది మోదార్చుఁగాక నిన్నాదిగౌరి

# కృష్ణార్పణము

[కర్మశతకము : నవపది]

ఘనీవిలాసపుచ్ఛత్రిఘాహాతలుల
శ్రీ-మద్రిపాథోఉసుషంగములలోడి
శఘానూతనఃఘూసముదాయముగ్ధద
స్వననవాపాంగకచ్ఛవులలోడి
హామ్రతిమత్స్యశిశు శిశుక్రీడార్థమత్స్యమా
త్రభర్త్యర్థనావైభవాప్తిలోడి
శఘకీపరిసూతివేశ్మద్వారదుర్ద్రష్టి
హాత్రహేతుఘటనదివ్యతలలోడి

పృషదఘఃస్థితిక్షాఅకుః గృపీటవివస
నార్థమేదమంభఃప్రవాహమ్ము నావి
వస్వకుదయ మాచంద్రిమఃపరిభము మత్రిప
యూంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

వర్షాకపతూళలవార్ణటచ్ఛిత్రకం
గాహాతంబులకు నుయ్యాల లూఁగి
కుంభజనోన్మదయారంభశుక్లచ్ఛవి
భవదంబుమృదుశయ్యపైన నూఁగి
మాఘమాసికకోష్ణమార్తాండసుచిధగ
చ్ఛబలితాంబువుల విశ్రాంతిఁ బొంది
శుష్కోష్ణవాదహాచ్ఛద్ధవార్వేణికాం
తర్లీఁపరిక్షితములఁ బొలసి

నాల్గుకాలాలపాటకంతపరిపూత
జలనివాసంబు కొలకు నాసార మాస
రత్తు నామధు వాగీరిష్మ ముత్తమాస్మ
దంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

ఊర్ధ్వతిర్యగధోముఖబహుస్త్రోడనాంభోవి
ధృతిఘూర్ణ తాసికతిలములైన
పరిత్యుషోమరుదంకురసాంద్రితబుద్బుదా
నీకసంఘట్టఫేనిలములైన

రాజద్వయశ్యాఫరపారిథయువతీన
కేశపాశ్రితపూదగంధిలములైన
బహుళియామోదవినిశ్వాసవాసితమాధు
రీనిర్ఝరీశర్కరిలములైన

కుసుమహావారిసంచ్యుతి నెనయ నఖిల
దేవతాసక్షితంబుగా నావిసృష్ట
పంచభూతమ్ము మత్కులపాలికాన
వామృతతనూగతాస్థి కృష్ణార్పితమ్ము

చాళ్ళమ్ములగోఁ గుచ్చి సోగగా భిల్లక
న్యాముగ్ధవేషమ్ము నవధరించి
ముంగురుల్ కొసల నిమ్ముగ వంకరగఁ జొప్పి
గిరిజానవాకృతిఁ గీలుకొల్పి
కరినిభత్కుచాగ్రపరిలంబినిక్లుప్తి
శాంబరీవేషంబు సంతరించి
నవరించి రత్నభూషలుగఁ దీరిచి దిద్ది
అతనియిల్లాలె యన్నట్లు మోసి

అమృతమోహనరత్నాకరాభిసరణ
వేళ నవనవ్యరాగాంకవేష మేచి
కావఁగ నిది శాశ్వతముగ మృత్యుఁ సతీమ
హాపవిత్రదేహాస్థి కృష్ణార్పణమ్ము

ఈయస్థి పతిపత్నిదా యతినుహిమ మం
చంభోదధిదేవత లాదరింప

అతిలోకసౌందర్యవతియస్థి యిది యంచు
నాగకన్యకలు మన్ననలు సలుపఁ
దమయంతి సొగసు నేత్రములఁ జూచినది యంచు
మత్స్యకుంభాదికుల్ మనుతఁ బెంచ
ఆపాదశేషసుకవింబల్లాలి డంమచు జలాం
తర్లీననావసంతతులు పొగడ

ఈమహావారిసంస్థాన మెనయుకొఱకు
నామహాప్రేమబలమున నామహర్ష
మతము నాసర్వదేవతావితతభావ
మస్మదీయపవిత్రాస్థి కృష్ణార్పణమ్ము

సుతహావిర్ధ్రుతమహాసుతతితూష్ణీంసురా
హాగదుషర్బుధరూపమైన జ్యోతి
ప్రాగభూతము భూతవత్పరిణమయిత
స్వీకరించిన యార్ద్రైతైకరసము
సర్వభూతపునారసత్వసంకోచవే
శ్లావికారోజ్జ్వలదమృతమూర్తి
అఖిలానకాశపూర్ణానుసంగతసంవి
దాకారపరరూపమైన బ్రహ్మ

మీమహాపస్వరూపము నామహాజ
లావిశారూపము నాప్రశయము నిరు
నునికికై యస్మదీయనాశోత్తమాంగ
నామృతతనూగతాస్థి కృష్ణాగ్నిణమ్ము

ఏతన్నదీకుల్య లెగసి పాడించెదు
రాజనంబులకు శ్రీరామగతు
ఏతత్పయఃప్రశస్తైధమానాంధ్రప్రా
ఛీదూషితామయాళికి శివాజ్ఞ

ఏతఃసరోబ్ధిస్వాపినాకృప వత్సోవిత
కశ్రేణి కి క్రాత్మసగతాకనవను
ఏతదంతర్గ్వసత్ప్రితజాతుతతి క
నోర్వ్యహింతంకరణౌపధమ్ము

గాంగ నివారి ఖాత్రిలింగవిషయమ్ము
నాసకలవారిజంతువు నమరియుండ
నస్మదంతర్జ్వలద్దీప మస్మదంగ
నాసుధాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

వితతోగ్రవార్జంతువివృతాస్యదశనసం
గ్రసనప్రమాదసంఘములవలనఁ
జాక్రీరబహుళతీవ్రప్రభంజనధుతాం
భఃప్లావణోప్లవములవలనఁ
బర్యగాధాంబుశోషకచమూహారణార్థ
పరికీర్ణ వాగురాపదలవలన
శుక్తికాద్యపజిహీర్షుజననానాసహా
కర్షణాదికదైవికములవలన

పొల్లు వోకయు సంచ్యుతి పొరయకయును
సతమహావారి నిత్యసంస్థాన మందు
కొఱకు నాతారకముగ మత్కులసుధేక్షు
ణామృతతనూగతాస్థి కృష్ణార్పణమ్ము

వాగ్జంతువిధుతజంబాలాంతసుద్ధత
బుద్బుదశ్రేణి యూర్పులుగఁ దనరి
అన్యోఽన్యసంఘట్టితాతివేలతరంగ
ఘోషఁ జేతులు మోదుకొనుట నొప్పి
అస్తవేళావీజితానిలాహతలట
చ్ఛిన్నడిండీరమ్ము చెమట నలరి
ఉపరికూజద్విప్రియోగవ్యథాప్లుష్ట
చక్రవాకియెలుంగుసమితి కూర్చి

నాకుఁ దోడుగ దుఃఖమంథరవిషాద
మూర్తి యీనది శాశ్వతమ్ముగ నె గాఁగ
అస్మదీయగోత్రవిభూషమైన మత్ప్రి
యాంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

ఒక యెన్నొ పుట్టుకలకు ముందరైన మ
త్ప్రాగబ్ధ మీరీతిఁ బరిణమించె
నానావిచిత్రజన్మకృతాస్మదఘరాశి
అంయి అయి నేఁటి కి ట్లయ్యోఁ గుదకు
పితృద త్తనుగు నా స్తి హాత మయ్యె నాయందు
ఆయ నిచ్చినభార్య యిట్లె పోయె
నా తండ్రిచేసిన నానామహాపుణ్య
కర్మ లీగతి గంగఁ గలసిపోయె

మిగిలినది యొక్కఁడే నాకు మేరువంత
బరువు నాగుండె గో మధ్య భాగమందు
అంతె పేరున కంతె భార్యాస్థిగాని
నాశరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము

# అస్థిప్రసాదనము

[ కర్మశతకము: ౧౦వపది ]

దీవ్యద్దివ్యసహస్రభానుకిరణోద్దీప్తాత్మమూర్తిప్రభా!
భావ్యాశాత్రుటనక్రియాపరిణతప్రౌఢప్రభావాంచితా!
నావ్యానంతమహాపదంబుధిపురోన్యస్తాగ్రకోణాచలా!
పవ్యాఘాతనిశాతబాణహారినత్రేస్రధా! నమ స్తే నమః!

క్ష్మావ్యోమాఖిలపంచభూతము చితామధ్యస్థసింహాసనా
గ్రీవ్యుత్పన్నభవన్మహాజ్ఞఁ బడియేకాఁబోలు స్తంభీభవ
ద్ధావ్యాత్మీయమహాణుసంచయముతోఁ దామైశ్మశానంబునం
దవ్యష్టాసువుగాఁ బొనర్చికొని దివ్యాస్థీ! నమ స్తే నమః!!

అవ్యాలోలమనఃప్రభావము శివాప్రాణేశ్వరత్వంబు స
ర్వవ్యాపిత్వము మంత్రవర్ణతతి రుద్రాక్షాదివాసంబు న్వ
క్త్వావ్యక్తుం డగు సామి తద్భుజగజిహ్వాగ్నిచ్ఛటల్ తోడి గ్రీ
వావ్యాలంబివిభూష వే మనెద ని న్నస్థీ! నమ స్తే నమః

దివ్యాక్షీ! భవదీయమౌ పలితమౌ దేదీప్యమానంబునౌ
భవ్యాకారము హేయమయ్యెఁ దలఁపన్ బ్రహ్మాండరాహస్యవి
ద్యావ్యాపారము గోచరించుఁగద నీయందున్ విచిత్రింపు మౌ
నవ్యాఖ్యానము చేయుచుం దుపనిషన్నానామహార్థాళికిన్

సవ్యామోహమయైన యీజగము దీక్షానంత్యసంక్లుప్తి
మవ్యాపారమునన్ దగుల్కొని యసంపద్భాజనంబై చెడెన్
క్రవ్యాదాభదురామయప్రతతిజగ్ధంబై మహామృత్యుజి
హ్వావ్యామానృతిలుప్తమయ్యెనసి నీవ్యాఖ్యానముల్ నెచ్చెలీ!

నవ్యప్రౌఢమహార్థముల్ భవదుపన్యాసంబు లానందరే
ఖావ్యక్తీకరణప్రశస్తములు సంక్లుప్తాఖిలక్షోణిగో
శవ్యాపారనిరాసహేతువులు డోలాసంచలద్దుష్టమౌ
యావ్యాపాదనలీల లూర్మినివహమోగాంభోదఘుంఘుల్ చెలీ!

హవ్యంబై చెడిపోయె నీజగము మోహాగ్నిచ్ఛటావల్లిరం
తవ్యంబౌ చతిదుఃఖభాగ్విషయసంతానంబులో నెంచి మం
తవ్యం బౌచును దారపుత్త్రనివహోత్క్షిప్తసౌఖ్యంబు హం
తవ్యం బీయఖిలంబు నౌచు విమలార్థం బూనె దీవో చెలీ!

అవ్యాజోపకృతీ! సమస్తజగ మేలా హా! సమస్తంబుగా
నీన్యస్తంబును నూహ సేయు నని నీకే నైజమైనట్టి మా
నవ్యాహారముచే శరీరగతభిన్నద్రవ్య మీరీతి భి
న్నవ్యుత్పన్నము నంచుఁ దెల్పెదవు భిన్నభ్రష్ట మంచుం బొరిన్

తా వ్యాపించె నదే మహాస్థిక! భవద్ధర్మోపదేశంబు నా
ఘూవ్యగ్రంబగు నాత్మలోన మరి సర్వేహావిధూతిన్ సదాఽ
భవ్యంబైన మదీయసర్వసృజనాభాగణ్వాణుమ్లానమ
ధ్యవ్యాక్రోశవివర్తనభ్రమదనంతధ్యానపూర్ణంబుగాన్

కవ్యాదుల్ భవదీయసారఝరిణీకల్లోలగర్భస్థితిన్
దావ్యాపన్నతఁ బొంద గామరపురీస్థప్రౌఢసౌఖ్యాలిచే
నవ్యుల్ నీకృపకై సతీవిరహితుండై యేను ప్రార్థించెదన్
దివ్యాంభశ్చలనంబు పొందకువె అబ్ధీ! మత్ప్రియార్థంబుగాన్

# బెడిసిపోఁక

[స్మృతి శతకము : ౧వ పది]

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
కాలి యఱ పోఁగ చూఱిన కట్టెవోలె
నడుమచుచున్నాఁడ నిట్లు కాఁగడుగునందు

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
నా సుధామయమగు జీవనంబునందు
విసము నొలికించుకొన్నాను వెడఁగు నగుచు

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
ఆటకై బెడ్డ విసరి కాలాహి లేపి
తత్ఫలముఁ బొందు బాలువిధంబు గంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
నలుగురి కసహ్యతాభాజనంబ నగుచు
సాఁగెద శ్మశానవాటికాష్ఠంబువోలె

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
అపుడు నాగుండెలో గుండెయైనదాని
బొమికలు బుజాన వైచుక పోవుచుంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
ఈశ్మశానస్థవాయసగృధ్రశునక
సంతతికి నిట్లుగాఁ గృపాస్థాన మైతి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
సగము చచ్చియుఁ జావక సగము కాలి
కాలక విచిత్రజీవిక గడుపుచుంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
మానుషము దైవమైన సంపత్తు నెంచి
దీని నైష్ఫల్యవిధికి నిందించుచుంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
మానుషము దైవికమ్మని తేనిదాని
పైకిఁ దరలించుకొందు నాభావవిధులు.

ఈదైవమ్ములుకూడ నానలెవె లోభేషామదక్రోధవాం
ఛాదుష్టాత్మ్మలు వీరి నమ్ముకొని యీపద్దుఃఖసౌఖ్యార్థినై
యీదౌర్భాగ్యము లేల త్రవ్వుకొన నిక్లే యుండిన ట్లుండి లో
లో దీర్ఘోరుతపంబుఁ జేసికొని నాలో నేనె నే నయ్యెదన్

# స నా త ని

[ స్మృతి శతకము : ఇవపది ]

కావ్యము లన్నియుం దఱచఁగాఁ దలఁపుల్ కనుకోసలాః భా
వవ్యపదేశమైన రసభావము గల్గుటఁ దోఁచుఁగాని నీ
దివ్యము నిశ్చలంబయిన దృక్ప్రకటీకృతసత్త్వజీవితా
ర్థన్యనధాన మెన్నటికి రా దొక వేయికథానకంబులన్

ఈకనులందె జీవితము నెల్ల గ్రహించెను నేర్పు జన్మ లె
న్నో కలసంబులం గొడిచితో మఱి వ్యర్థుని నేరి యేరి యీ
నాకుఁగఁ గ్రుమ్మరించితివి నాకధునీమధుశీకరంబు తా
టాకుల రేకలో నొలికినట్లుగ నైనది దేవతాకృతీ!

తోడితోడిజన్మలన్ దరిమెదో తబిసీ! మఱి యెన్నిజన్మలం
దుడికిన గుండెలోఁ దబిసివో మఱి యీజను విల్లి వచ్చి నీ
యుడుగనిదా తపస్సునకుఁ గొక్కప్రయత్నము చేసిపోను నీ
వడి జను వొక్కఁ డాగవు తపస్సును బూరితిఁ జేయ వేటికే?

బ్రతికినవాళ్ళ నాసుఖము పండినవాళ్ళ కొకింత జాలి లే
నితనము కాపురోన్న పతి నేనొకయప్పుడుగాని జాలి పొం
దితి ననఁ గష్టపుంబనుపు దీనని సేయుచు నోర్పు చేఁతగా
సతికి నుపస్థమే బ్రతికినట్లుగ నైనని ఓతపస్వినీ!

ఆతపస్విని తనబ్రదు కంతయు నెదఁ
దాల్చి కొల్చిన దిద్దుఱు నైనతముల
బహువయోమూర్త శిలవోని భర్త నొకనిఁ
బాయరాని కష్టాధిదేవత నొకర్తు

ఓబహుజన్మయోగిని! బహూకృతజాచునకష్టభాగినీ!
నాబరువెల్ల మోచుకొనినావు స్వకీయమునట్లు నీవు నా
లో బహిరంతరంబులను దోఁచినవాక్కుఁడుగాఁగ నిష్ఠురం
బౌ బలనంత మీబ్రికుకునందలి యప్పరమార్థ మేమిటో?

ఈవ్రతతైత్త్వ్య మెచ్చుటికి నెచ్చటి కింత లగింపుఁ దెస్చెనో
తీవ్రపవిత్రశీలలు పతివ్రత లల్ల యరుంధతీముఖల్
సువ్రత లాదిదైనతపశుద్ధచరిత్రిలు తన్మహాతపః
శ్రీవ్రతభాగినీ! పొటమరించితి నిత్యపథిన్ సనాతనీ!

కోనల వెల్గు లొత్తికొను కోమలచంద్రికవార్ధఖండము
ప్లావితతేజమౌ బలిమపహావిత మాదలఁ దాల్చి కష్టమౌ
లావిరుదత్కపాలవిచలద్గళహారముతోడి శైవకాం
తావిలసన్నవాకృతివి తారితి భూతగణాప్తవృంబలెన్

అల రజతాద్రికొమ్మకొనయందలి వెల్గులు నీమనస్సులో
పల విరళంబులై కొలువవచ్చెను భౌమములైన నాతలం
పులతుదలందు సద్దుకొనిపోయెను నీమన సద్దుకొన్నవే
ళల దయచేసి యీవెలుఁగులన్ బిలిపించుకొనంగఁబోకువే?

మిగిలియున్న యీవెల్గుల చిగురుమంపు
ఈమహాశోక మెత్తిన యిరులగుంపు
ఒకటికన్న నొక్కఁడు మన సొత్తికొంచుఁ
దాల్చుచున్నవి సమతులాదండరీతి

# త్రైగుణ్యము

(స్మృతి శతకము : 3 వ పది)

ఈతనువెల్ల కూర్పుదొరయించిన సత్త్వరజస్తమోగుణా
నీతవికారకల్పన మనేకము లింద్రియముల్ తదాత్తమా
శాతగళంబు జీవనము సాగినత్రోవల నెల్లఁ దద్గుణా
నీతవికారకల్పనమె నిండె భృశమ్ము ప్రవృత్తిహేతువై

అణువుల నిండి దేహములయాగు విలీనములైనయట్టి యీ
గుణములు పాళ్ళుగా నమరి కూడి సమంబుగ నున్నవారికిన్
బ్రియము గల్గు సత్త్వగుణబంధురసామ్యముకల్మి దంపతీ
గణమునకుఁ దద్గుణాధికతఁ గల్గిన చిక్కనిబంధ మేర్పడున్

నిరతమహాణుసంభ్రమణనిర్ణయముంబడిఁ బొందియున్న మా
యిరువురియందు సత్త్వగుణ మెక్కువయౌట రజస్తమోగుణో
ద్ధతులు కల్గియున్ బ్రణయతోయధిలోఁ జిఱుజంటనావలై
తిరిగితి మల్ల ప్రేమపథిఁ దీర్చితి మల్లు లతాతరుల్బలెన్

ఆ॥ సమానమైనను విషమమైనను సత్త్వగుణంబునంగాఁ బు
ట్టగు వికృతివ్యథావిస్మృతి తక్కిన రెండు మనోభిధాప్రథా
స్పదము రజోగుణంబ యొకపాటిది తామస మెంతమైన సం
పదకలదైన సత్త్వము భంగము పెట్టు ననేకభంగులన్

ఆయమలోని సత్త్వగుణ మంబుదమై శిశిరార్ద్రనూతన
చ్ఛాయలు నాకొసంగమునఁ జాది మదీయగృహావనిస్థిర
శ్రీయుతరేఖకుఁ గురియఁజేసిన దట్టపుచానజల్లులన్
నాయెదలోని సాత్త్వికగుణం బొకబిందువుకైన రామునన్

ఆయమగుండెలో వినయ మంతట నిండి రజోగుణంబె తే
దాయెను కాని భర్తసహృదయాం బఖిలంబు రజోవికారమై
పోయినయట్టి హేతువునఁ బొంగి నతిస్థిరబుద్ధి యెందొ కా
నీ యపుడప్డు తా నభినయించు రజోగుణ మస్మదర్థమై

ఆయమలోఁ దమోగుణము నల్ల రజోగుణ మట్టు లల్పమే
ఆయెబుపమ్మి నాదయిన యజ్ఞత నామె స్వభావగాఢతా
చ్ఛాయలు పొంది తత్ప్రకృతిసంపదయై చను సత్త్వవైభవ
వ్యాయతి నామెఱింగినదియైనను లేదను భ్రాంతిఁ బూన్చెడిన్

ఆమెకు నేకదేశవిషయంబు తను స్సది కోపరూపమై
యేమెయినైన మాటపకు టించుక యోర్వఁదోఁచుచుండునా
కో మఱి యాగుణంబు సహజోద్గత వాసనావర్ధితంబు క్రో
ధామిత మామె తామసము నంటి సహస్రశ ఉద్గతింజనున్

ఆ ననుఁగూర్చికాని విషయంబుననైన తమస్సు పట్టఁగా
రాని మరిధాకృతిం జని పరస్పర మల్లినప్రేమసూత్ర మే
మానో యఁటన్నభీతి కిరవై దినసంగతి సత్త్వవైభవ
శ్రీనిశితాసికృత్తమయి ఛిన్నతఁ బొంది కదర్థమై చనున్

నాయఖిలప్రశస్తకవనంబున కాయమ పట్టభద్రురా
లాయమ లేక యాధునికమైన మదున్నతవిత్తవృత్తి లే
దాయమ లేక యింద్రియములందలి నాయధికార మింత లే
దాయమ లేని నాదుబ్రదుకంతయు లేనిద యయ్యె నేఁటికిన్

# విధురత

[స్మృతిశతకము : రవపది]

అట్టిమనోజ్ఞదైవతమవై మనసొగ్గిన యేయఘూర్ఘ్వముల్
పట్టి చరించకుండ ననుఁ బాలనఁ జేసితి నేఁడు నీవు లే
కట్టిదినాల నీయెడ దురాచరణం బొనరించునట్లుగా
నొట్టిముకొంచు నే నఘము లొడ్డుచు నుంటిని దేవతాకృతీ!

ప్రభువులు దైవముల్ గలరు భక్తులు నుందురు వారు కర్మకుం
ప్రభువులు కారు, వీరు విధివ్రాతను దాటనులేరు, కాని యీ
ఋభువులు సాధనాపథి భరించెద రింతియ కర్మభావి దుః
ఖభరము దేవతల్ జనులు కర్మకధీనులు పొందనేవలెన్

నిజమున కొక్కమాట తరుణీ! ననువంటి విచిత్రపూరుషుం
డు జనన మొంది కష్టము లనుక్షణమున్ భరియింపఁజేసి యీ
సృజనకు సర్వదాపమురరీకృతి మూలమమైనదానికిన్
ప్రజలు భరింపఁగల్గుదురె బాలలతాసుమకల్పులందఱున్

పగులంగ ప్రేలిపోదు గునపంబులఁ ద్రవ్వినఁ బాము వీడ దే
మిగ ఘటియించినన్ విభృతి మేకొను మొండితనంబు నిట్టినా
దగు తొలిమాయలో నొదిగినట్టిది గుండియ నూయ బెంచుకోఁ
జిగురగు పాసమాన్యమును జెంద దిదెంత విచిత్రసృష్టియో!

కొసకుఁ బ్రహారహా మాఁగి పెనుగుండములై నిలఁబడ్డ కర్మసం
గ్రపచపు కొటిమొద్దువలెఁ గయ్యాలు వారిన నా మొదందలో
మొసళ్ళవోలె దుఃఖములు మూఁగుచు గూడులు కట్టుకొన్న న
ల్పసుఖంబు సౌఖ్యముల్ తిరుగులాడిన లోనికి గుంజివేయుచున్

వలపట దాపటన్ బెనచినై చెడు నాశయు దుఃఖ మున్న మె
ద్దులజత కట్టి బండివలెఁ దోలుచునుంటివి జీవితంబు ని
న్నలసటఁ గిత్త ముందడుగు వైచినచో ముసలెద్దు దాపటన్
విలవిలఁ గాడి క్రిందఁ బడవేయును బట్టెడ దూసిపోవఁగన్

నా హృదయంపు రాజ్యమున నాకవిచిత్రము తన్వి మాత్రము
త్సాహము లేదు పట్టిపరిభుశక్తికి నేమి ఫలంబు గల్గు? నీ
తో హరియించిపోయినవి తొల్తటి రెంగు రిపుల్ విజృంభితో
గ్రాహరణంబు సల్పెద రఁటన్నను జిత్రము లేదుగా! చెలీ!

ప్రతినునుకు త్తరంగములు పాములుగట్టిన చల్లనీరముల్
ఋతువులు సేవ్వరించి వివరించెను బాలరసాలశాఖినా
నతివ! మదీయమా తనువు ఆతొలినాళుల ముద్దుపారి యే
ఋతునవచిహ్నముల్ తల ధరించదు బాడిద రొండుబోదమై

ఒకదినునైన నాయెడద నుమ్మలికంబను పుర్వు పుట్టి యీ
సకల మసేవ్యమై చెడియెఁ జచ్చిన భాగము కత్తినాదరఁ
బెకలిచి శిష్టసేవ్యతకుఁ బెట్టెద నన్న వి దేమిచిత్రమో
అకట! తదీయభాగమె మహాప్రియమైనది నాకు నాత్మకుఁ

నీ వఖాంగోనామార్గముల నిండిన జానకివై రఘూద్వహుం
గా వెలయించినావు నను గట్టిగ ముప్పదియాఱువత్సరా
లీ నలభూమిగర్భమున నెప్పుడు చొచ్చితివో మఱప్పుడే
నా వెలయింపు లూర్మిప్రతినాగభసాక్రమణంబులఁ జెడెఁ

# నీడ

[ స్మృతి శతకము : శివపది ]

సీ. శోకపెద్దవెల్గు వయి నీవెలుఁగారిన నాదుజీవిత
వ్యాపృతి యీకవిత్వ మనునట్టి విచిత్రపునీడ పారె నో
దేవి! యరుంధతీప్రముఖదివ్యమహాఃపరిలీనమూర్తి ఆ
నీవెలుఁగుల్ పరోక్ష మయి నేఁటికి నీడలు పారఁజొచ్చెడిన్

ఇ. యొకపూలబాటఁ బడి యేగెద నీతొలిమొగ్గ లింత వి
ప్పెదల ఘటించుకొన్న చిఱుపూవులుఁ దావులు చిమ్ముపూలు నీ
తుదఁగల వాడిన త్తలయి తోఁచిన పూవులు, నెల్లపూవులన్
బదనగు వాడిగుండె కొసవాలిన నావరలక్ష్మి ముద్రియే

అఱువది దాటి నే ముసలి నైనపుడైనను నాయెడందలోఁ
బరువము తప్పనట్టి యెలప్రాయపుఁ గోమలి నీవె నిల్చి ని
ర్భరపరిపాకముం జెడక పాలనఁ జేయఁగ నిట్టు లైతి వో
తరుణి! మదీయనూత్నకవితాబహుమార్గములందు నిచ్చలున్

ఎప్పనను నేఁ బరీక్ష కొలయించిన శోకములోని వెల్ల యా
పసంగను దుఃఖముల్ పగునుపట్టిన పోలిక నన్ను నేన చూ
చెవ నటువంటి నాకునయి చెందినభార్యవు నాను మేనికిన్
బాసలిః కొంచెమైన సిరి పుట్టినతోన త్యజించి యేగితే

ఇక్క కేనాబు లీగిడస లీతలతిక్కలు ప్రాఁతమాటలం
చెక్కడ నక్కడే విడచి యేగెదు నారలుకాని భావుకా!
అక్కడ నక్కడన్ వెలుఁగులారవ చోటుల నాకవిత్వమం
దక్కునునియదైవతమహఃప్రసంగం బని గుర్తు పట్టితే?

పలికలనచోకగుంఫనముపజ్ఞవిచిత్రపుఁ గావ్యరంగభూ
మికిఁ దెగవోలె నీవెలుఁగు మెత్తిన యందము ధైర్య మూది నే
న కరుణవిప్రలంభరసనాయకుఁడన్ గవిగూడ నేన భూ
మిక శోకవంద నొత్తెదసుమీ! అల సూత్రము నీవు పట్టుటన్

బెగడ పసంగ నాహృదయవీణను దంత్రులు బిఱ్ఱగాఁగ లా
గి గుడుసు లేద నెక్కువ బిగించినచోఁ బెగునో యటంచు బె
ట్టుగ సరించిన్ దటిమెదున్ జామి యోసి విచిత్రిగాయనీ!
తెగి యొకశేల్లుఁగన్ జరమతీవ్రనినాదము రేగునట్లుగన్

తొలియమృతంబు నింపుకొనుకోసిట నాసుధ యొల్కిపోయెదో
సిలి తడియారి లేఁతపొరఁ జీలిన సన్ననిపేశులైన ప్రే
ఘులయెడ నామఁ గల్గు స్మృతిగంధము సాఘసుధాప్రసాదితో
త్పలమకరందరీతి కవితాసుఖభోగుల కెట్లు పంతునో

ముంపుగ కొండయంచుఁ బడఁబోసెకు నేఁగుధాస వారిపా
తంపు శిఖోపరిస్థలమదారఝరంబున ఘూర్ణితాంబువుల్
కంపితఝంపలన్ కళపెళల్గల నాకననంపుఁదోరినో
సొంపులఁ జూడఁగాఁ బ్రకృతిశోభనమొకాక మ తేమి యున్నదో

మనసు విఘాతమై మఱియు మాట విఘాతము వీనికైత యం
దని యెవఁడేని నన్నది యథార్థము తేనియసోనజాలుగాఁ
జనదు నుదీయధార కొనసాఁగెడు నీకరుణన్ కృతార్థతన్
గనినది కాక భావుకజగత్తున కర్థవిచారయోగ్యమై

# సహజస్మృతి

[స్మృతిశతకము : ఉవపది]

మరియును నిన్ను నేనడవిమధ్యమునందుననైన దింపలే
దు కనడి నెచ్చటో బ్రదికియుండును వటం చనుకోఁగ నెవ్వరో
పాపమునకున్ ఘటిల్లు తనభార్యను బిడ్డలనుం గతించి పో
యి చనిన వారి నెప్పుడో యదృష్టము పండిననాఁడు చూడఁగన్

తరువులు పండుచున్నయవి ధారుణి సస్యము లీనుచున్న దు
ష్ప్రాపమునఁ జల్లగాలులును వచ్చెను విచ్చిన మల్లెపూలతోఁ
దరుణి మదాత్మసంస్థిత యుదారమనోహరభావ యెన్ని వ
త్సరములు దాఁటినన్ దిరిగి తాఁ గనుపించదు వచ్చియెన్నఁడున్

ఆవిధున్ మరి యాశ్మశానమును నాహా! నాయెదన్ ధూర్తరే
ఖావిస్పష్టముగాఁగఁ గన్పడెడు నెక్కాలంబు నీమూర్తిరే
ఖావిధ్వంసకముల్ దయారహితముల్ గాఁగా నశక్తంబులై
పోవున్ నీమధుమూర్తి నాయెడఁదలోఁ బూర్ణంబుగా మాపఁగన్

సారిదిక్ వే పరిణామ మొందఁగ నశించుం బూర్వరూపంబు ను
త్తరకాలంబున నాత్మరూప మనసా తరోక్తి వికటంబుగాఁ
బరఁగున్ నీసుఖ మే నెఱింగిన పురాపత్నీప్రభావోజ్జ్వల
త్స్ఫురణం బంతయుఁ జచ్చిపోయినది హాహా! మత్తమాయష్టికన్

ఎడఁదయు దేహమున్ మనసు నీత్రయమందునఁ బూర్వపూర్వముం
జెడుమనుమున్న యూయెడఁద ఛిన్నతఁ గాంచినఁ దక్కరెండునుం
జెడకయుఁ జెడ్డయట్లె, పరిశిష్టము జీవిత మెల్ల నూరకే
యొడలునఁ గీలుద్రిప్ప మనసొప్పక నాడెనువల్లుతోఁ జెనున్

అమ్మయి నాలుగైన పురుషార్థములందునఁ గామ మొండె దే
హమ్మునయందునన్ సహజ మైనది గేస్త్రువాఁడు ధర్మకా
మమ్మున యోగచిత్తుఁడును మధ్యను గామలతావిభేదనో
గ్రమ్మయి జీవితంబు చెడఁగా సహజంబగు చావు పొందులే.

ఒగి ధగ దార యోగులు మహోన్నతచిత్తులు కొంద ఱుందు రే
సగమగు జీవితమ్మునఁ జాలక యోగము భ్రంశమందినన్
మిగిలిన జీవితమ్మునను మేదిని ధర్మము రక్ష చేయు వృ
త్తిగ మనుచుందు రూర్జితమతిన్ దనుసృష్టి ప్రతీక్ష చేయుచున్

ఒకయశనిపాతమున నుర్విజ మొక్కెడఁ గ్రీలిపోయి త
క్కక సగమందునం జివురుఁ గాయయుఁ బచ్చదనంబుపొల్చు నీ
సకలము మింటియందున నెసంగున బోదయు నెంచుకట్టెయె
ప్రకటితమైన లోభము పరశ్వధవృత్తులకుం ఘటించుచున్

ఒకపెనుమఱ్ఱి యిట్టులయియుండియుఁ జుట్టుననున్న బాలవృ
క్షకముల శక్తిచే నిలచి కాష్ఠతఁ బొందకయుండఁ జూచువా
రికి ధరణీజభావ మురరీకృతముం గలిపించుచుండుఁ బా
ర్శ్వకలితమైన యార్ద్రిత యురస్థ్నముగా భ్రమవెట్టు చెంతయున్

తెచ్చి సువర్ణపూ ప్రతికృతిన్ రఘురామకథాక్రితూర్జితా
భ్యుచ్చయమార్గ మేఁగెదన యుర్విజవాలిక నీవ తోతు వా
కస్వరమైన నాయెడఁదఁ గమ్మనితావులు చెల్ల రేఁగునా!
యెచ్చటి శాతపావనము లేగితివేని హా తేంద్రియాకృతీ!

# స్వప్నవాంఛ

[ స్మృతిశతకము : 2వ పది ]

జాగ్రత్స్వప్నము లివ్విరెండు వినులాచ్ఛభ్రాంతియూలంబులే
జాగ్రత్కాలపు భ్రాంతి జొక్కినటి యాస్వప్నంబునంజొక్కమే
వ్యగ్రిస్వాప్నికజాగ్రతంబులను నేలా వేరు చేయంగ ధా
రాగ్రాహంబుగ నెల్ల స్వప్నముల నౌరా! నిన్ను దర్శింపక౯

కలితసర్వజాగ్రిత్కాలఖండములను
జ్ఞేయ మొక్కం డనుస్యూతమై యెసంగు
నట్టి దేహాంతరముల స్వప్నాంతరముల
నేల కారా దనుస్యూతి యేకధార

అదియును జాగ్రదవస్థా
స్పదమగు జ్ఞేయంబుతో నెసంగిన నైక్యాం
బుధితానేకంబులు దుః
ఖదములు సందర్భములు సుఖదముల్ చెలంగున్

కడునడి నీవు స్వప్నలతికాసుమమంజరి నొంచు నిచ్చెఁగన్
గడఁగి యనుగ్రహించిననుగాని ముదానతజీవితంబునం
దోఁచినెద సూనముం దోఁచుచుఁ దూలిన నీదగు తావిపిల్లునం
గడిగెదఁగాదె నాయెడఁదఁ గ్రమ్మిన దుఃఖమలంబు భామినీ!

ఈధారాభవదీయదర్శనముకై యేలా విచారింపఁగా
సాధారణ్యము కాని కన్పడుట నాస్వప్నంబున న్నీవు దు
స్సాధంబైనది నీవు తోఁచుట, మనస్సంచారిభావంబు లే
గాథల్ కట్టుచు స్వప్నమం దనిన వాక్యంబుల్ వృథాజల్పముల్

మెలఁత! సుషుప్తియొక్క పొలిమేరలయందలియల్పముల్ కుమా
రిఁబటలు, స్వప్నముల్ కలవరింతలు, గాఢసుషుప్తిలగ్నముల్
కల లనిపించుకోఁదగిన గౌరవ మందవు స్వప్నవాచ్యముల్
మలసిన జీవభావగతమున్మనోహరసంవిదంబుధుల్

జీవుల భావనాబలముచేతను సంస్కృతు లెల్ల స్వప్నధా
రావలమాన మంచు నవరాద యదైన భవన్నిమగ్నతన్
భావన నాది యొప్ప నొకస్వప్నమునందున రావు నీవు దు
ర్భావులు కల్పనాకుటిలవాక్కు లతీంద్రియద్రష్టృమానులున్

కలఁ గనెడువారికంటెన్
గలయందున వచ్చు జీవి కరము ప్రధానం
బలఘుతరకామవిహాతులు
కలలందున వచ్చి తాము కన్పింతు రహో!

ఈ వాక యోగినీప్రకృతి వేటికి వచ్చెదు స్వప్నసీమలం
దీవెడ భావనాపటిమకృష్టవు గావును నివు రావునన్
జీవులు కొందఱున్ దనువు చెందెద రాత్మకృతాల్పతావసుల్
భావన బంధులందుఁ బెఱవారలఁ గర్మఫలంబు పంచఁగా

తావలమైన కర్మఫలదాతలు తారు వివర్తమూర్తులై
దేవతలైనఁ దాల్చెదరు దివ్యశరీరచయం బుపాసనా
భావన మూర్తి కట్టెదరు పండినజీవు లరూపభావితుల్
భావనచేతఁ గన్పడరు వ్యాప్రియమాణపథంబు మాయఁగన్

## దుఃఖచర్చ

[ స్మృతిశతకము : లవపది ]

హృదయము మానసంబు నివి రెండును రెండు విభిన్నవస్తువుల్
హృదయము దానితోఁ జివ యది మొస్సొను దానిచె చర్చచేసి యి
య్యది యిది దీనియందు ఫలితార్థము సున్న యటంచుఁ జెప్పినం
గుదురుచుకోదు సంతసిలుఁ గుందు నసహ్యత రూపుకొన్నదై

హృదయము మాయమధ్య యదియే తొలిజీవుని మూలరూపమీ
బ్రికరణాలు సర్వముఁ హృదయపాలితముల్ చిదనంతభావసం
పద పొదిగొన్న వస్తువది మాయను లక్షపొరల్ ఘటించుకొ
న్నదియును మాయనుండి యొకనాఁడును వచ్చుటనూహ లేదిదిఁ

రహిని బునఃపునఃకలితబ్రహ్మపదార్థమహానుభూతికిం
గుహారముతోడ నే యలముకొంచును మాయ మొగుళ్లు నిల్పు దే
ప్రవహాగములోన నుండిన యిరమ్మదవృత్తిని నిత్యవర్షహృ
ద్గహారము కాలమూర్తి యనుదారతఁ జీకటులన్ భజింపుమన్

తొలిబుధులైన యోపనిషదుల్ పదార్థము నుపాసనాక్రియా
కలితపథంబులం దొకటిగా గ్రహియించిరి కావ్యమార్గదో
హంబులు రసానుభూతి పరమార్థముగా భరతాదులౌ మునీం
ద్రులు హృదయప్రధానతను నూత్నఁగాని చెప్పిరి విజ్ఞతాఖనుల్

ఆనందాబుధి దుఃఖ నీరాయుగళమ్ముం దానందసారమ్యముల్
లేనే తీవ్ర శరీరధారులకు నోలిన్ దుఃఖపారమ్యసం
స్థానంబుల్ తిరువుల్ శుచావధికసంధాచర్వణాంత్యస్థితిన్
దానై యీమొదయే రసాకృతిగ సంధానించు బ్రహ్మాత్మమున్

హృదయము దుఃఖముద్ర వహియించును దాని మనస్సు రేఁచునీ
హృదయము సౌఖ్యముద్ర వహియించును దానిమనస్సు రేఁచునీ
మొదను మనస్సు సారథి యహీనుఁడు తారథి భావయోగి తాఁ
గదలుటయే సతంబు పనిగాఁగొను సారథిచేతఁ గృష్టుఁడై

కలఁగి నగానఁ జీఁకటి నగమ్మునఁ దెల్వి మనస్సు వేయిరీ
తుల నటు చెప్ప వేయిఫణితుల్ గొని యిట్టులఁ జెప్ప బిట్టు కొం
దలఁబడఁ జేయు వెంబడిన ధైర్యము చెప్పైను నిల్వఁజను చం
చలమగు నిత్యవృత్తిని నిజంబగు దుఃఖము దానిరూపమై

ఎడఁదను వేయిమార్గముల నియ్యాని మోసము చేయు నందునో
నోడుపుగఁ దాను బాధపడుచుంటి నటంచును జెప్పఁ గాలిలో
నడఁగిన ముల్లు నేయితరమైనను రాచుక బాధపెట్టు నీ
చెడుమన సెప్డు రాచువ హృషీకము లాట నెడంద దుఃఖముల్

పాడిఁచేను దేహ మొకపాపపుఁబుస్వాగ దుఃఖ మొప్పినన్
జాడతిరానిలంబుగను సాఁగి మనస్సు పొలాన నంతటన్
నిండఁగఁజేయు దీని ననిన్ మొదలంటఁగఁ ద్రుంచు నెప్పుడో
గుండెయు నిండుకుండ తొణఁకున్ మనసెప్డు కదల్చుచున్కిచే

ఈ దుఃఖంబులుగూడ నిష్టములగాదే గుండెకున్ దీవ్రహృ
చ్ఛోకముల్ పూర్వపుసౌఖ్యముల్ స్మృతికిఁ దెచ్చున్ మానసం
బుగ్రబా
ధాదీప్రంబగు దుఃఖమందునఁ బురాతత్సౌఖ్యభావంబు సం
పాదించున్ స్మృతిరూపజీవు పటవన్మాయాచ్ఛిదాహేతువై

# మృత్యు విచారము

[ స్మృతి శతకము : నవపది ]

ఏది క్రీడోపయోగరాహిత్యకలనఁ
గాయ చచ్చిపోయిన దంద్రు కర్దనముల
అనుభవాయోగ్యతాజుష్టమైన ఫలము
చచ్చిపోయిన దందు రాస్వాదవేళ

అనుభవబుద్ధి దీనిపరమార్థముఁ జూచిన నెల్ల వానియం
దనుభవబాహిరంబయినయట్టి యవస్థను జచ్చు టందు ర
య్యానుభవముల్ స్వనిష్టమునునై పరనిష్టమునై కనంబడుల్
మనుజులయందు మృత్యు వనుమాటకు నెక్కడనైన యర్థమై

తదితరమంతయుం దలఁపఁ దత్సమయంబునఁ దత్తదింద్రియా
స్పదమగు నేతదేశమున సాఁగి యొకించుక కూర్చు దుఃఖ మి
య్యది సకలేంద్రియార్థపరమార్థమునం గించుకించి సర్వమా
(బమకునయందుఁ గ్రమ్మియవురా! యనుభూతినిఁ జిచ్చువెట్టుఁ బో

అనుభవబుద్ధి వచ్చినఁ దనంతట మృత్యువు వచ్చినట్లె య
య్యనుభవబుద్ధి వచ్చినఁ దనంతట మాయయె వచ్చినట్లు వ
చ్చిన దనుమాట లోకమును జెందిన దాయనుభూతి లోకసం
జనితము లోక మియ్యదియు జంట పరిభ్రమణోగ్రశీలమై

అనుభవ మెన్న లోకఘటితార్థమ యైనను జీవులక్షణం
బనుభవబుద్ధి జీవునకు నబ్బెను మాయను బొందియున్కి దా
న, విభృతుఁ డేకమూర్తి తొలినాఁడది హేతువుగాఁగ నీతఁడా
యనుభవ మెల్ల నేకవిషయంబుగఁ జేసి రమింప నెంచెడున్

తరుణీమృత్యుజన్యమైన దుఃఖ మిది యిత్థంభూతమై గాఢదు
ర్భరమౌ దుఃఖము నాత్మలక్షణసమగ్రవ్యం బాచు దీపించు ని
గ్భగ నీమృత్యు వనిత్యతాప్రకటరూపం బీయనిత్యత్వ మీ
మరణాంబై కనిపించుచున్నయది సమ్యగ్దర్శనాధ్వంబుగా.

ఇదియు స్ఫురించునంతవఱ కెద్ది యనిత్యమై గోచరించుచు
న్నది పరిశిష్ట మయ్యది సనాతన మన్న యభిజ్ఞ కూర్చుచు
న్నది యొకదుఃఖ మియ్యది ఘనంబుగఁ గూర్పకయున్న దీనివం
టిది మఱియొండు లేదు ప్రకటీకృతచిత్కళ తోఁపఁజేయఁగన్.

ఒకఁడే వస్తువు దానిచేఁ యొకఁడై యొప్పారునే వ్యావహా-
రికముగా లేఁదని స్వీకరింపక సమర్థింపఁగరాదా యె భ
ప్రకదఃబాకృతి, మాయ యన్ననిది మిథ్యాస్తుసాహాయ్యరం
జకమై యొప్పుట నిత్యవస్తువు దిదృక్షాశీలురాఁరికిన్

అసలు చూచెడువారికి నాశ లేదు
నాకుఁగోను మార్గ మక్కఱలేదు మాకు
మందబుద్ధులకోసమై మరణముండె
దానియనుభూతియును సమృద్ధముగ నుండె

ఈదుఃఖమ్ములను మరణము
పాపులు త్రివ్వకొనియున్న ప్రభువులనాదుల్
ఛేదించుటకన్నను నను
మోదించుటయుండె ప్రియము పుట్టెను మాకున్

# స్మృతి కాని స్మృతి

[స్మృతిశతకము : ౧౦వపది]

మరల వివాహమాడియును మానిని! నీవు గతించి పెక్కు పు
ష్కరమునుదాఁటి భార్యయనుశబ్దమునాయెడలఁ బ్రయుక్తమై
స్ఫురణస్వభావరీతి నినుఁ బొందును దోడ మఱల్చుకొందు నా
ద్విరచితపూర్వకర్మఫలవీధు లసాధు లటంచు నెంచుచున్

ఒగిఁ గనుమూసియున్ దెరచియున్ భవదాకృతి యచ్చుగ్రుద్దిన
ట్లుగఁ గనిపించు నిచ్చలును లోచనవీధిక నీమనవ్వు నీ
దగు గమనంబు సర్వమును నప్పటి కిప్పటి కొక్కరీతిగా
నెగడెను విస్మృతింగని నీస్మృతి యేమిటికో లిఖించెదన్

పొరి నిరి వేయికల్పనల బుంగ జగత్తును విశ్వసింప న
బ్బురమగు నమ్మకంబులకుఁ బుట్టు, గతించిన జీవి యేదో త
ద్విరహముఁ బొందు జీవి మఱి కాఁడొ! పరస్పరసాహ్య మెల్ల ని
ద్ధర నొకఁడే రహించుఁ బయిదారుల వారును వీర లెవ్వరో!

అనుభవపారమార్థ్యమునకైనవి మేనులు నిక్క మెన్నఁ ద
త్తనువుల కించుకేనియుఁ బ్రధానతఁ గల్గను తాదృగూహచేఁ
దనువులయం దభిజ్ఞ యరుదారఁగఁ గల్గును వీడిపోవు న
య్యనుభవరూపజీవునెడ నట్టియభిజ్ఞ ఘటిల్లు నేగతిన్

నీవెంటంబడి నేనుఁ జత్తుననఁ దన్వీ! యింతయాకాశ మం
దీ వే మైత్రినొ చచ్చిపోవుపయి నే నేమౌదునో సంస్మృతి
వ్యాస్మృతిన్ మనరెండుజీవులకు నైక్యం బెన్నినా ళ్ళన్నినా
ళ్ళవిచ్ఛేదము కల్గెఁ బైని తలఁపుల్ వ్యామోహసంజాతముల్

ఆయమ నాకు భార్య యన నాతనువందలి యాస ముఖ్య మే
దో యొకజీవుఁ డాతనువు నూచినఁ జాలునుగాని జీవుఁ డేఁ
డో యెఱుఁగంగరా దెటేఁగియున్ మమకారము లేద వానిపై
మోయఁగముఖ్యమైనది యముఖ్యమ ముఖ్యముముఖ్యమైచనన్

ఆనీదేహమునందు జీవుఁడయి యేయతుండో రతుస్సా వే
ల్గొ నిక్కంబుగ నెవ్వఁడైనది నెలో నాకు సామాన్యలో
కానీతంబగు సంస్మృతిప్రభవసౌఖ్యజ్ఞానమే చాలుఁగా
ఆసీదేహము రూప మియ్యవియె ముఖ్యంబుల్ సచేష్టాకముల్

# స్మృతి కాని స్మృతి

[ స్మృతి శతకము : ౧౦ వ పది ]

మరల వివాహమాడియును మానిని! నీవు గతించి పెక్కు వ
త్సరములుదాటి భార్యయనుశబ్దము నాయెడలన్ బ్రయుక్తమై
స్ఫురణస్వభావరీతి ననుఁ బొందును దోడ మఱల్చుకొందు నా
ద్విరచితపూర్వకర్మఫలవిధు లసాధు లటంచు నెంచుచున్

ఒగిఁ గనుమూసియున్ దెరచియున్ భవదాకృతి యచ్చుగ్రుద్దిన
ట్లుగఁ గనిపించు నిచ్చలును లోచనవీధిక నీదునవ్వు నీ
దగు గమనంబు సర్వమును నప్పటి కిప్పటి కొక్కరీతిగా
నెగడెను విస్మృతింగనని నీస్మృతి యేమిటికో లిఖించెదన్

పొరి నిది వేయికల్పనల బుంగ జగత్తును విశ్వసింప న
బ్బురమగు నమ్మకంబులకుఁ బుట్ట, గతించిన జీవి యేదో త
ద్విరహముఁ బొందు జీవి మఱి కాఁడో! పరస్పరసాహ్య మెల్ల ని
ద్దర నొకఁడే రహించుఁ బయిదారుల వారును వీర లెవ్వరో!

అనుభవపారమార్థ్యమునకైనవి మేనులు నిక్క మెన్నఁ ద
త్తనువుల కించుకేనియుఁ బ్రధానతఁ గల్గను తాదృగూహచేఁ
దనువులయం దభిజ్ఞ యరుదారఁగఁ గల్గును వీడిపోవు న
య్యనుభవరూపజీవునెడ నట్టియభిజ్ఞ ఘటిల్లు నేగతిన్

నీవొటంబడి నేనుఁ జత్తుననఁ దన్వీ! యింతయాకాశ మం
దీ వేమైనొ చచ్చిపోవుపయి నే నేమాదునో సంస్మృతి
వ్యాస్మృతిన్ మనరెండుజీవులకు నైక్యం బెన్నినా ళ్ళున్నినా
ళ్ళావిష్కారము కల్గఁ బైని తలఁపుల్ వ్యామోహసంజాతముల్

ఆయమ నాకు భార్య యన నాతనువందలి యాస ముఖ్య మే
దో యొకజీవుఁ డాతనువు నూచినఁ జాలునుగాని జీవుఁ డేఁ
డో యెఱుఁగంగరా దెఱిఁగియున్ మమకారము లేద దానిపై
మోయఁగముఖ్యమైనది యముఖ్యమ ముఖ్యముముఖ్యమైచనన్

ఆనీదేహమునందు జీవుఁడయి యేయత్నుండో రత్నస్నా వే
ల్పో నిక్కంబుగ నెవ్వఁడైనది నెలో నాకు సామాన్యలో
కానీతంబగు సంస్మృతిప్రభవసౌఖ్యజ్ఞానమే చాలుఁగా
ఆసీదేహము రూప మియ్యవియె ముఖ్యంబుల్ సచేష్టాకముల్

నాయీదుఃఖ మి దేమి! నే బ్రతికియుండన్ నీవు చాకుండఁగా
నీయీదేహమునందు జీవుఁ డెవఁడేని మత్ప్రమాణాయువై
కాయంబున్ వహియించియుండ డనియో కా దెవ్వఁడో నాకునై
కాయం బేటికిఁ దాల్చు స్వల్పముగనై కర్మైక్యసంధానముల్

వాఁ డెవ్వఁడో వహించిన
పోఁడిమియే లేదు నేన పూనితి నిన్నున్
వేఁడియగు కర్మబలమున
వేఁడిమి తగినంత లేక వెస మత్కర్మన్

పని వేల్నమ్మకముల్ ఘటించికొనియీ వ్యాఖ్యానముల్ చేసికొం
చెదకున్ శాంతి ఘటింప నెంచెదనుగానీ! యింతవ్యాఖ్యానసం
పద నాసొంతము కానిదౌట నిది శంపాదేహా! వాగిందిరా
స్పదమై నాయెద నొవ్వరుంతుదమగా స్పష్టంబుగా సాగఁడున్

··

# దుః ఖ ని త్య త

[ ని త్య శ త క ము : ౧ న ప ది ]

క్రకుణాస్త్రాసము లెంతమొందికిని శోకంబంతు భార్యల్ గతిం
పను దుఃఖ పరు నేను దీని నొకకావ్యంబుగా వినిర్మించి మ
త్తనుదీనదుఃఖభరంబు దీని నొకపెద్దం జేసి వారెవ్వరె
వ్వరొ యుగాంతిని చేసినా రనెడుభావం బూని యగ్గించెదన్

మరియును జూడు మేను త్రపమాలి వియోగకృతిన్ రచించెదన్
మరియు వివాహ మాడితిని మానిన దింతయు లేదు జీవితం
బుహుతరదుఃఖశీలి యయినాడో మరి రెండవపక్షు మూని దా
శరథియొ కామినీవిరహశీలుల నవ్వులపాటు మాదృశుల్

వారివియోగకావ్యములు వ్రాసిరి పూర్వమహాకవుల్ మఱిన్
నేరిచినట్టినా.డ గృతి నేను రచించెద నాకు నేన క
ట్టా! గసహోదరుడన్ దెలియనయ్యెద నియ్యెదలోని వట్టితొం
దర దరహాసభాసురమనాగ్వినయాదరభావుకావలిన్

అక్కటా! వేరు చావ రచుసట్టిది యున్నదె చావ నెప్పుడో
యెక్కడనో యటన్న మతిహీనత దుఃఖము పుట్టు నప్పుడే
అక్కడనే యటం చెఱింగినప్పుడు దుఃఖము పుట్టదేమొ కా
దక్కట! యేడ్చుచుం జనువునందిన దుఃఖము సాజమై చనున్

నెలలు గడచినఁ దరువాత నేర్చుకొన్న
యదియ న వ్వేడ్పు జన్మతో నైన గుణము
నవ్వే దేమిటి కనుట ప్రశ్నంబు కాని
పరగ నే నేడ్తు నన్నది ప్రశ్న కాదు

ఇంకుట మెన్నడుం గలుగ దెండదు తీయదు నిత్యదుఃఖకూ
లంకష పారుచున్నది బలంబుగ బిట్టు తుపాను రేఁగి దుః
ఖాంకముగాఁ గఁ దక్కినదియంతయు లోకము మూఢవృత్తి సా
ఖ్యాంకముగాగ నాడుకొన నయ్యది కాని దదన్న మచ్చికన్

దోస మెఱుంగుఁ బండితుఁడు దుఃఖ మెఱుంగు వివేకి దుఃఖ మ
భ్యాసము చేయఁగాఁ దగినయట్టి యొకానొక విద్య సద్యు
ద్భాసితచిత్తవృత్తికిని ప్రాథమికాంశము వేఁడు దుఃఖసం
త్రాసియొ వాఁడు సాధనపథవ్యతిరిక్తుఁడు జ్ఞానవీథిలో

ఇద్ది దుఃఖపుఁబుట్టని యెఱుఁగలేన
గొఱ్ఱె వేఁటుత్తుపానుల కొగ్గి కాని
యఱఱయఱజడి యుఁదిఁకె యఱముకొనఁగ
వెలి నదో కారణం బని వెక్కికొనుచు

విసము మ్రింగిన వేలుపు వెక్కసంపు
దుఃఖమును మ్రింగఁడాయె నా దుఃఖ మెంత
మనసునకు నిష్టమైనట్టిదినుసా కాని
దీనితత్త్వమ్ము తెలిసియుఁ దెలియరాదు

అశరీరమ్ము ననాది నాంతము త్రికాలాబాధ్యమున్ మాయపే
ర్నిశకున్ మాయకునుసృష్టికిన్ గ్రమువియన్నిర్మోకమాహా! క్రియా
దశ లేనప్పుడుకూడ దుఃఖ మిది నిత్యంబై యఖండాకృతిన్
విశదంబై పొలుపాఱు గూఢతమసంవిద్దృశ్యనాశ్యంబునన్

# కర్మనిత్యత

(నిత్యశతకము : ౨వపది)

అల్పుల్ చెప్పెద రల్పకారణములన్ వ్యాపన్నచిత్తుల్ వృథా
జల్పుల్ తర్కసహంబు కాక పరినిష్ఠాసంప్రవద్వ్యాహినీ
కల్పంబై ప్రవహించుచున్నయది యీకర్మంబు తద్వ్యాహిని
శిల్పుల్ నీవును నేను యత్కృతము భాసించున్ దదావిష్టమై

ప్రళయంబందున సర్వకర్మలు నశింపంగాఁ బునస్సృష్టి సం
దళనానేహమునందుఁ గర్మ మొదలెన్నన్ రాదు నాన్ గర్మకం
దళముల్ కాక సుక్షేమియౌ సృజన కాద్యంబౌ నిమిత్తంబు త
త్ప్రళయంబన్న విలీనతాగుణము నిద్రావస్థ తత్సర్వమున్

సూత్రప్రాయముగా వచింపఁబడియెన్ సూ! అద్ది సంకల్పమం
చత్రత్యంబు రహస్య మియ్యదియ కర్మానంత్యసాంతత్యముల్
సూత్రప్రగ్రథితంబులైన మణులై సొంపారుఁ గల్పాకు ల
గ్రత్రేతాపరిదీప్తముల్ మొదల జాగ్రత్కర్మసంస్యూతముల్

స్వస్థానచ్యుతికిం బ్రియంపడి నిమిషంబు జన్మ సంవిత్క్రియా
నష్టాభూతము కర్మ కర్మపగులా బ్రిహ్మర్షు లీహేతువై
పరిస్థానోజ్జ్వలమార్గదీపములుగా భావించుచున్నారు క
న్యస్థాస్తుత్వాముకల్పకల్పములుగా గ్రంథ్యర్థ్వముల్ మోగగన్

ముకు గాకాగము కర్మ నీడ గోలంబుంపుల్గోటు సంకల్పపూ
ర్వకకర్మారంభమూణమై చనిన సర్వంబున్ బునఃకామనా
ధికసంజాతవినూత్నకర్మజనితాధివ్యాధిదుఃఖంబు పెం
చుకయీలోకము లద్ది సౌఖ్యమనుకొంచున్ నిత్యమై పొల్చెడున్

చింతితమైన పాపములు చేయుచునుందుము తత్ఫలంబు సం
క్రాంతముగాఁగఁ బోయి నరకంబున నుందుము యిట్లు నేము ను
ద్భ్రాంతిఁ జరించుచుండెదము పారము చెప్ప డఁటన్న నల్ల కా
లాంతమునందుఁ దాను బ్రళయంబది కర్మసుషుప్తిరూపమై

కామన లేక కర్మకును గత్తెఁబెట్టి విముక్తుఁడై 'బహు
స్యా' మితిభావనావిషయుడై మఱియుం జను వెత్తి వే మఱిన్
గామనఁ గోసి నిత్యపరికల్పితకర్మత నైన దేమి లే
దే మఱిఁ గాని దంచయిన నేమియు లేద నిరంతవైఖరిన్

మనసాత్రాదూరుఁడనై శౌరిం బరమహంసంబోలె నిష్కామక
ర్మను సేయఁగ వలె దానికంటె మమతారంభుఁడనై చేయు క
ర్మను మేల్ సౌఖ్యమొ దుఃఖమో ఫలపరిగంభా త్రసౌఖ్యంబుత
థ్యము సంకల్పను సేయ నేటికిఁ దదాత్త క్లేశభీతుండనై

చేకొని ముక్తులై చనిన జీవులదైన ప్రమాణ మాత్ర సం
చీకృత భాగమందు గొలుఁ జెందద యియ్యది కర్మనిత్యతా
ప్రాకృతిఁ దాల్చినట్టి విషయంబగుఁ జిట్టెమునిష్ఠ తగ్గుం
గాక యదేల యూరకయు గర్తమునందునఁగూడ వేయుటల్

సతితో గాతురుఁ డయ్యెనే శివుఁడు నేసౌఖ్యంబు లేకుండఁగన్
సుతతో గాతురుఁ డయ్యెనే ముని వశిష్ఠుం డూరకే బ్రహ్మయై
తతసంకల్పము చేయు బ్రహ్మము సముద్యత్కర్మపుంజంబు వి
కృతిలేనట్టిది కర్మ కుల్యకరణిన్ సాగున్ త్రికాలంబునన్

# నిత్యతానిర్ణయము

(నిత్యశతకము : 3 వ పది)

కృపణాత దుఃఖకర్మలను నెంతగఁ జెప్పిన నిత్యతావిచా
రపథమునందు నంధబధిరంబగు ద్రోవనుఁ బోవఁగాక నే
రుపుమొఱుఁ జూడఁగా నివి యరుంతుదముల్ గుణమై యవస్థమై
యెపుడు పరాశ్రయంబులుమరెద్దియొయాపగసూపసేయకన్

శాంతి యొక్కటి పరమలక్ష్యంబుగాఁగ
నీగుణావస్థ లివి శాంతిహీనములగు
శాంతి పరమందె కలద తచ్ఛాంతిపార
మొక్కఁడే దిక్కు సంసృతిఁ జిక్కుమతికి

ఓతప్రోతము నున్మనీకృతవిచారోదారరత్నాకరుల్
ఖ్రాతిన్ భావపథిన్ విచారపరముల్ త్రయ్యంతరూపుల్ ఋషుల్
చేతస్సర్వపథానుశాసకులు తత్సిద్ధాంతవాక్యాగ్రణా
సీతంబై చను శాంతి వేలుగతి లేనేలేద సంసారికిన్

భాషావిచారముగూడ నిస్సంశయముగ
సద్గ్రంథమొక యూహ సేయుట యది విచార
పూనుమొకట్టి స్థితి యూహ పరమకోటి
నాంచితమైన కర్మాదిబంధములకు

తనకుఁ దాన సర్వోహాసంధాత యొసఁగు
తనకుఁ దా సర్వవిద్యావిధాత యొసఁగు
పూర్వఋషి భావనాసస్యములను గోయు
నాఁటివలె నైన యూహాసంతతులు గాక

అవి సూత్రీకృతమైన యర్థమయ సూహాశ్రేణి వ్యాఖ్యానల
స్సవిశేష ప్రతిపత్తికంబుగ రచింపఁబడ్డ భాష్యార్థల
గ్నవిశేషావరబుద్ధియై జగము భిన్నంబన్యోఁ దాత్పర్యసిం
ధువులన్ గన్యవిభిన్నతన్ బహుగతిన్ నూన్యోన్న సంస్కారమై

తనమతమే యథార్థ మని తా నెవఁ డెంచుఁడు నిక్కమెన్నఁగాఁ
దనమత మేమి యున్నయది తద్గతకాలమహర్షి లోకభా
వనముల నొక్కఁ జేసి తనపట్టిన త్రోవయ కాక నిత్యమై
చనినది వేద మొక్కటియ శాస్త్రములన్నియుఁ గల్పితంబులై

తనయల్పజీవితంబం
దున నశ్వర మగుచు నెల్లఁ దోఁచిన సర్వం
బును కొలఁతబద్ద చాలక
వినశ్వర మాఁటంచు నెంచు వీఱిఁడి యెవఁడో

విదితమనోజభానముగ వేదపుఁ జెట్టుచివళ్లు గాలికిం
గదలని రాగరంజకతఁ గాంచని చిత్రవసంతరూపమై
మృదుమధువీధులం గనఁ జరించుచు నాయెడ లే నెఱుంగ నీ
పదమున సర్వదుఃఖములు బాసెడు మార్గమె గోచరించుచున్

నీనాయందఱి సమ్యక్
జ్ఞానసమాహారమైన సంవిత్పదమై
యానందనికేతనమై
యానిత్యాకార మొక్కఁడై చెలువొందున్

# కఠము

[ నిత్యశతకము : రసపది ]

ఓహో! మృత్యువు మృత్యువు
దేహంబున నంటియుండె ధీనిధి వైనన్
దేహమున నంటియుండకు
మాహా! మిత్రికిని గండ యండిచ్చినటుల్

ముంపగు విత్తమోహమున మూఢుఁడు తీరనికోరికం బ్రమా
దాపడి సాంపరాయమతి తా నెఱుఁగండు కడిందికోర్కె సా
లింపుల లోకమే తలఁచు లేదని చెప్పఁ బరంబు నాఁ డహో
కొంపకుఁ దెచ్చు మృత్యువునకుం గడు దగ్గరిమట్ట మెన్నఁగన్

ఎవఁ డవిజ్ఞాత యమనస్కుఁ డెవ్వఁ డశుచి
యెవ్వఁడో యయుక్తమన సేవనియింద్రి
యములను బోగరుఁ బోతుగుర్రములు లాగి
నట్లు చను వాఁడు మృత్యువునాప్తమూర్తి

వెలుపలివైన కోరికల వెంబడిఁ బరువులు వెట్టి మృత్యువ
న్వాల వలపన్ను పాశముల బాలుఁడు చిక్కఁగొనున్ ను ఈవలి
వల నది వేఱు వేఱిదను భావము కలిగినవాఁడు నిత్యయా
త్రలు పోవరించుఁ బొందు నిరతంబుగ మృత్యువునుండి మృత్యువున్

శీల హృదయంబునందు ముడులొంది మెలంగును నాటకొక్కనా
డులు మఱి వానియందునఁ గడుంగడు నొక్కటి మూర్ధవిస్సృతం
బలయిక దానిఁ బట్టుకొన కన్వల నుండినయట్టి నూఱునా
డులఁ బడి పోవువాఁడు మృతిఁ డొంకఁబడిం జనుఁ దా నెఱుంగకన్

కృషి పొసరించుచుందుము వరింపుము తత్ఫలమంతయున్ శతా
యుషులగు బుత్రపౌత్రులను నొందుము మహాశో! పశుహస్తి
హేమముల్
తృషితుఁడ వౌచుఁ గోరుము ధరిత్రినిఁ బాలనఁ జేయుచుండుఁ గి
ల్బిషమతి నాశవెట్టు ననలీలగ మృత్యువు సర్వకాలమున్

ఏ కామము దుర్లభమో
ఆకామము కోరుచుండు మది లభియించున్
నీకంటె మతెన్వండని
చేకొమ్మని మృత్యు వాశ చెందించుఁజుమీ.

తొయ్యలులెల్ల నీ కితరదుర్లభలుఁ లభియింత్రుచున్నో నీ
వియ్యనిలాధ్వ మెల్ల వహియింపుము చిత్రరథాధిరూఢుఁడై
యెయ్యెడఁ దూర్యనాదముల నెల్లయుఁ గాలము మేలుకొన్మటం
చొయ్యన లాగుచున్నయది యూరక మృత్యువు పోఁగిన్నైననుఁ

చల్లనిపిల్ల తెమ్మెరలు చందిరువెన్నెల సన్నజాజులున్
మొల్లములైన గందమెయిపూత లుశీనరచామరంబులున్
మెల్లని ప్రేమమాటలును మెత్తనిసెజ్జలు కమ్మఁగొజ్జఁగుల్
వెల్లనిపూవుటీరముల వేఁగు ని వన్నియు మృత్యురూపముల్

ఉత్తిష్ఠత, జాగ్రత, లో
కోత్తరమతులైన గురుల నొందుము, జ్ఞానం
బెత్తికానియున్న పదనగు
కత్తిసుమీ దాని దాఁటఁగా శక్యమ్మె!

# కేనము

[ నిత్యశతకము : శివపది ]

వేల్పులచే నొకప్డు గెలిపించెను బ్రహ్మము యుద్ధమందునన్
నిల్వఁగరాని గర్వమున నెత్తికిఁ గన్నులు వచ్చి యాతరా
గెల్పు తనంతఁ దామగనె గెల్చితి మంచును దమ్ము మించి యే
వేల్పులు లేరఁటంచుఁ దుది వేల్చిరి వారలహంక్రియామతిన్

విజ్ఞత తమ్ము దాఁటి యొకవిసము శేదముకొంచు నుండి స
ర్వజ్ఞులె యొచు నుండిన సురప్రకరంబునకున్ నాఁటికిన్ స్వరూ
పజ్ఞతఁ దోఁచరాని యొకవస్తువు తోఁచిన శేట మోహములం
బ్రజ్ఞలు మాని చూచిరి ప్రతాపగతబుద్ధ్యుపేతధీరులై

మకుటమువంటివాఁడు సురమండలియందునవన్నైన యగ్ని త
న్నికటతలంబుఁ జేరి యనె నీవెవ, రీవె నరున్న నేన! చె
ప్పక తెలియున్ మహాగ్ని నన, వారక యేమి పౌరుషం వంచనన్
వికలముగాఁగనై తగులఁబెట్టుదు సర్వము నంచుఁ జెప్పెనన్

దగ్గరకుఁ ద్రోసె నొకతృణ
మగ్గియు ముట్టుకొన డాసె నది తాఁ గాకన్
సిగ్గతి పునపుగ ముంచుచు
నగ్గి తొలఁగిపోవ నాథమై యది వెలుఁగన్

మకుటమువంటివాఁడు సురమండలియందున నైన గాలి త
న్నికటతలంబు జేరి యనె నీ వెవ రీ వెవ రన్న నేన! చె
ప్పక తెలియుఁ మరుత్తు నన వాఁడక యేమి పొనర్తు వంచనన్
వికలముగాఁగనై విసరివేసెద సర్వము నంచుఁ జెప్పినన్

దగ్గరకుఁ ద్రోసె నొక తృణ
మొగ్గను వాయువును నూఁచియాడి ఫలము లే
కగ్గయి సిగ్గయి తొలఁగిన
దగ్గలముగ నద్ది నాథ మరాచుచు వెలుఁగన్

మకుటధారియైన మఘవుఁడు చనుదెంచి
యెవర వంచు నడుగ నెఁచుఁగొన
నామహాపదార్థ మగుపించకుండఁగఁ
బోయె నచటఁ దోఁచె ఫుల్లకుమారి

విలసన్మోహనమూర్తి కన్పడియె నస్వీభ్రమత్తనూ జాతని
శ్చలసౌదామనివోలె భావసముదంచచ్ఛోభనానాంగి వే
ల్పులఁజేఁ డంజలిఁ బూని మ్రొక్కి దివిషల్లోకేశ్వరీ! యింతగో
పంః గన్పించని దేని చెప్పఁగదవే ప్రాణేశ్వరీ! నావుఁడున్

అదియే యానందాకృతి,
యదియే చిత్కళయు, సత్తు, నదియే బ్రహ్మ,
మ్మది సర్వశక్తిమూల
మ్మదియే, దానిని నెఱుంగ దల్పజ్ఞమతుల్

అల్లం చని పల్కరించిన యగ్నివాయు
లంతఁ జనియున్ గాంచినయట్టి యింద్రు
డధికుఁడై గన నింక బ్రహ్మమ్ము నెఱుఁగు
టెట్టిదో దానియునికి య దెట్టి దగునొ!

# ప్రశ్నము

[నిత్యశతకము : ఉనపది]

తనగఁగఁ బిప్పలాదుని విదర్భజుఁడై చను భార్గవుండు ని
ట్లని యడిగెన్ మహాత్మా! ప్రజ నంతయు దేవత లెంతమంది క
న్నని ధరియింతు, రెవ్వరు ప్రకాశము తెచ్చెద, గట్టివారియం
దునను వరిష్ఠుఁ డెవ్వఁడు మనోవిభవాయతనా! వచింపవే!

తనగఁగఁ బిప్పలాదుఁడు విదర్భజుఁడై చను భార్గవున్ వచిం
చెను గగనంబు వాయువు విశిష్టుఁడు వహ్నియు నీరు ధాత్రి వా
క్మనసులు శ్రోత్రనేత్రయనంబును ప్రాణము మేను తాల్చి మం
చును వెలిగింతు నాచునను చున్ ధృతిఁ జెప్పు దనుండ నెంతయున్

వారలకున్ వరిష్ఠుఁడగు ప్రాణము చెప్పెను మోహమూఁదు వ్యా
హారము లాడబోకుఁ డొకఁడైన వు భాగము లౌచు నేన వ్యా
పారము చేయుచుండుఁ జూడి ప్రాణమునందు ధరింతు నన్న వా
రేరును శ్రద్ధధానత వహింపమిచే నభిమాన మూనుచున్

ప్రాణమునుండి లేచినది ప్రాణము వారును లేచిపోవ గా
ప్రాణమునందు నిల్చినది ప్రాణము వారును నిల్వ భూమిభృ
త్ప్రాణము తుష్టియుంచున మధువ్రతముల్ పతి లేవ లేచి ని
ర్వాణము నందిన ట్లతఁడు వచ్చిన నింద్రియముల్ స్తుతింపఁగా

ఆతఁడె యగ్ని మూర్తి దహనాకృతి సూర్యుఁడతండె యంబుదా
యాతుఁడతండె యింద్రుఁడును నాతఁడె వాయువునైనదియాతఁడే
యాతఁడె పృథ్వి చంద్రుఁడును నాతఁడె యాతఁడె సదసత్తురెం
డాతఁడె నిత్యమౌ నమృత మాతని మించిన దైవ మున్నదే

ఆకులు బండిచక్రమున నడ్డఁ బ్రతిష్ఠితమైనయట్టు ల
ప్లోకము లౌచు ఋక్కులు యజుస్సులు సామములు నాల్గువర్ణముల్
తేకువఁ బ్రాణమందునఁ బ్రతిష్ఠితముల్ ఋభురాజునందు న
ప్రాకృతదైవతంబయిన ప్రాణమె సర్వనిష్ఠమూర్తియై

నీవు సమస్తగర్భముల నిల్తు ప్రజాపతివై సుహాగబలుల్
జీవులు నింద్రియంబులును జేర్తురు నీకు నహింతు వెల్లరా
దేవతలన్ సమస్తపితృదేవతలం బ్రథమస్వధాకృతీ!
యీవ యథర్వుఁడాంగిరసుఁడీ ఋషు లెల్లగ జ్ఞానరూపమై

ఇంద్రుండవు రుద్రుండవు
సాంద్రములగు తేజములకు స్థానంబవు నీ
వింద్రియముల కధిపతివి య
తీంద్రిజ్యోతిస్సులకును దరణివి విధివై

ఏతమవు నీది వాక్యాన
చేతంబునఁ గనులఁ జెవులఁ జెంబు వాసుపొ యా
నీతనువు శివకరంబగు
గాంత వదలిపోకు మమ్మ! పావనము! నీవుఁ

ముల్లోకంబున వృత్తము
తల్లీ! నీయెడఁ బ్రతిష్ఠితంబయి పొలుచుఁ
బిల్లలయెడఁ గృపఁ బూనుము
వెల్లుగఁ బ్రజ్ఞయును శ్రీయుఁ బెంచుము కరుణఁ

# శ్వేతాశ్వతరము

[నిత్యశతకము : ౭వపది]

అరయ నవర్ణుఁడౌచు నిహితార్థుఁడు తాల్చును శక్తి యోగని
ష్ఠురుఁడయి యేకమూర్తి బహువర్ణము నంతమునందు సర్వమే
డైఇఁ బొనగయించు నాతఁడొకఁడే రవిచంద్రులు పంచభూతముల్
సనగ నతండె శుక్రము ప్రజాపతి యాతఁడె బ్రహ్మ మంతటన్

ఆతఁడె పూరుషుండు నలినాక్షుఁడు పుత్రుఁడు పుత్రి యాతఁడే
యాతఁడె వృద్ధుఁడై నడఁకు నాతఁడె పుట్టును విశ్వతోముఖుం
డాతఁడె నీలుఁడై హరితుఁడౌచుఁ బతంగుఁడు లోహితాక్షుఁడై
యాతఁడె మేఘముల్ ఋతువు లంబుధి యాతఁడు కాని దున్నదే

అజ బహుసంతతిం గనెడు నట్టిది లోహిత శుక్ల కృష్ణ సా
మజగమన సరూప జుషమాణుఁ డజుం డొకరుండు దానిభా
వజకృతులందుఁ గ్రిందగుచుఁ బైనగుచుండును భుక్తభోగుఁడై
యజుఁ డొకరుండు దానివిషయమ్ముఁ ద్యజించుఁ బరోక్షకాముఁడై

మొగిని సుపర్ణముల్ సయుజముల్ సఖముల్ యుగళంబుభిన్నవృ
త్తిగ నొకవృక్షమందునను దేఁకునమై పరిషస్వజించెనున్
నొగులంగఁ బిప్పలంబును దినున్ ఖగమొక్కరుఁ డన్యమైన యా
ఖగ మొకయింత ముట్టకయ కన్నులఁ గనుమాయ నిచ్చలున్

ఒకతరుశాఖయందునను యుండియు నీతఁడు మునగ్నమానసుఁడై
వికలమనస్కుఁడై యనుభవించును దుఃఖచయంబనేకమున్
నొకతరుశాఖయందునను యుండిన యాతని సర్వలోకశా
సనుఁ బహుమహాత్మ్యునిన్ గని మొసంగుచు దానును వీతశోకుఁడై

మహితమునక్షరంబు పరమంబగువ్యోమమునందు బుక్కులున్
దహనముఖుల్ సురాళి నిహితస్థితిఁ గాంచును వట్టికన్నదుం
డహరహ మేమి చేయు విదితాఖిలవేదుఁడు వాని నేరఁగా
మహితునియందు నిచ్చలు సమాసతఁ గాంతురు విజ్ఞతాఖనుల్

ఛందము యజ్ఞముం గ్రతువు సద్వ్రతముల్ మఱిభూతభవ్యముల్
చెందిన వెన్ని వేదములు చెప్పెనొ నిన్నును నన్ను మాయ రూ
పొందఁగ సృష్టి చేయు సకలాధిపుఁ డీశ్వరు డాతఁ డొక్కఁడే
మొంగును మాయయే ప్రకృతి యొల్లెడ నీశ్వరు నంగముద్రయే

ఈశుఁడు దేవతాప్రభవహేతువు సంస్థితిహేతువౌచు వి
శ్వేశుఁడు రుద్రుఁ డుగ్రఋషి మహేశుఁ డతండు హిరణ్యగర్భునిన్
కేవలు జాయమాను వహించుచును దర్శనమాత్ర మాకు దా
నై శుభబుద్ధి ప్రేమ సకలానుగంబులఁ గూర్చు గావుతన్

ద్విపద చక్షుష్పాదంబులను దేవతలన్ మఱి యెల్ల లోకముల్
కృపమెయి నేను హేసుఁడై భరించుచో యొక్కఁడు తాను
సూక్ష్మసూ
క్ష్మపువెలుఁగొక్కఁడై కలిలమధ్యమునందు ననేకరూపవి
శ్వపుఁగోలి స్రష్టన్నైయుఁగుచాని కనంతము శాంతినూర్చెడున్

అతఁడె కాలమందు భువనాఖిలరక్షఁ బొనర్చుచుండుఁ దా
నాతఁడె సర్వభూతములయందు నగూఢత సంచరించుఁ దా
మాతనియందె బ్రహ్మఋషు లాదట దేవతలున్ వసింత్రు త
ద్జ్ఞాతయె మృత్యుపాశముల సంతతియందున ఛేత్తయయ్యెడున్

# మాండూక్యము

( నిత్యశతకము : లవపది )

ఖండ మఖండమై చనిన కాలము సర్వము నోంకృతిప్రథా
మండిత మోఁపదార్థమె సమంజసమై చను బ్రహ్మ మాత్మని
త్యుండును నొక్కరుండును చతుష్పదుఁ డాతఁడె సర్వకాలబ్ర
హ్మాండసమస్తకారకుఁ డనాద్యుఁ డనంతుఁ డతండె సర్వముల్

ప్రథమపాదము వైశ్వానరంబు స్థూల
భుక్కు నేకోనవింశతిముఖము నంగ
సప్తకము బహిఃప్రజ్ఞము జాగరితము
స్థానమైనది సర్వమాయానుతంబు

చను ద్వితీయపాదము తైజసము వివిక్త
భుక్కు నేకోనవింశతిముఖము నంగ
సప్తకమ్ము నంతఃప్రజ్ఞ మాప్తమైన
స్వప్నవీథియె దానికి స్థానభూమి

కడుఁ దృతీయము ప్రజ్ఞానఘనము ప్రాజ్ఞ
మోఁము నానందమయము నానందభుక్కు
నొక్కఁ డగు సుషుప్తస్థాన మొక్కకొక్క
తూలు స్వప్నము తూలు చేతోముఖంబు

ఆతఁడె సర్వేశ్వరుఁడును
నాతఁడె సర్వజ్ఞుఁ డతఁడె యఖిలప్రభవుం
డాతఁడె యంతర్యామియు
నాతఁడె భూతముల కెల్ల హర్తయుఁ దలఁపన్

ప్రజ్ఞము నాంతరప్రజ్ఞము బాహిర
ప్రజ్ఞము నుభయతఃప్రజ్ఞ కాదు
ప్రజ్ఞేతరంబును బ్రజ్ఞానఘనము కా
దగ్రాహ్య మవ్యవహార్య మగుచు
నది యదృష్ట మ్మచింత్య మ్మలక్షణము న
వ్యపదేశ్య మదియ శివంబు శాంత
మేకాత్మగతప్రత్యయైకసారంబు ప్ర
పంచోపశమము నవంచకంబు

ఇది చతుర్థము విజ్ఞేఁగియ యాత్మ
కడఁగి యవ్యక్తుఁగంబు నోంకార మిద్ది
కలలు నాలు గకారం బుకారమును మ
కార మిట్లర్ధమాత్ర మ్మఖండయుక్తి

అరయ జాగరితస్థాన మది అకార
మరియు వైశ్వానరం బందు నా ప్రివలన
నాదిమత్త్వమానలనఁ దద్వేది సర్వ
కామములు పొందుఁ బ్రథముఁడై కాంచుఁ బ్రిథను

అరయ రెండు స్వప్నస్థాన మద్ది తైజ
సం బుకారము కర్షచే సాగు మాత్రి
మరియు నుభయాంబు కాన పనాముఁ డగుచు
బ్రిహ్మవిత్కులజుండగు స్వప్న వేది

మూఁడవది సుషుప్తస్థానమును మకార
మద్ది ప్రాజ్ఞము మితిచేత నంత్యమగుట
నెవఁడు తద్వేత్త వాఁడు సర్వేశ్వరుండు
సర్వ మాతయు వాఁడై యపీతి వాఁడు

ఒగిఁ జతుర్థ మద్ది యోంకార మవ్యవ
హార్య మొకఁడు శివము నచ్ఛ మాత్మ
ఆత్మచేతఁ జొచ్చు నాత్మయం దాతఁడు
నెవ్వఁ డెఱుఁగు సిద్ది యెవ్వఁ డెఱుఁగు

# ఈశావాస్యము

[ నిత్యశతకము : నవపది ]

ఏది జగంబునం గదలు చింతయు నున్నను నద్ది యీశ్వరా
చోదిత, మందుచే జగముచొప్పునఁ బోక భుజింపుమీ!, పర
శ్రీ దొరయించుకో మనసు చేయకు, వర్ష శతంబు జీవితే
చ్ఛాధృతిఁ బూనియుండు మను సంగతకర్మము లాచరించుచున్

ఈగతి సంచరించు నరు నింతయుఁ గర్మము తాఁకఁబోవ దీ
నాగురయంపు బద్ధుఁడగు వాఁ డెవఁ డాత్మహానుండు వాఁడు మృ
త్య్వాగమ వేళ నంధతమసాభిధమైన యసుర్యలోకయా
త్రాగమనంబు సేయు వితతంబుగ సూర్యరుచివ్యపేతమున్

మనసున కద్ది పూర్వ మతివానసవేగము నిత్య మొండు దా
నినిఁ బడి పర్వులెత్తును మనీషయు సర్వము మాతరిశ్వవా
రివిచయ మద్ది యొక్కఁడు భరించుఁ జలాచల మద్ది దూరమం
దున నికటంబునన్ వెలిని దోఁచును లోపలఁ దోఁచు నంతటన్

అఖిలభూతమ్ము లాత్మయం, దాత్మ యఖిల
భూతములయందుఁ జూచెడు పురుషునకును
లేదు విచికిత్స, కోపమ్ము లేదు, లేదు
శోకమును, సర్వ మొకటిగాఁ జూచునెడల

అది శుక్రంబు నకాయ మవ్రణము సర్వాంతస్స్న నస్నావిరం
బది శుద్ధంబు నపాపవిద్ధము మనీషాస్థాని తా నొక్కఁడు
న్నది సర్వంబును దానయైనది జగన్నానాపతుల్ దానిశ
శ్వదనూనాజ్ఞను సర్వకాలము సమర్ప్యత్వంబు దీపించుచున్

ధీరులనుండి మూ కిది శ్రుతివ్యవహారము వచ్చుచుండె వి
ద్యాగతికిన్ ఫలం బొకఁడు నన్య మవిద్యకు, రెండు నేర్చినన్
బేరిమి దాఁటు మృత్యువు నవిద్యను దత్కృతికర్మపేర్మి వి
ద్యారుచిరాభిమర్శ నమృతత్వముఁ గాంచు సనాతఃస్థితిన్

ధీరులనుండి మూ కిది శ్రుతివ్యవహారము వచ్చుచుండె వే
ర్వేరు ఫలాభిసంధి యగు బిట్టు నసంభవసంభవంబులన్
మేరలు దాఁటినొంతయును మృత్యువు దాఁటు నసంభవంబుచేఁ
దారిన మాయ నోర్చి యమృతత్వము గాంచును సంభవంబుచే

కడు సత్యముఖము మూయం
బడియుండె హిరణ్మయంపుఁ బాత్రముచేతన్
గడు దయఁ దెరువుము పూషుఁడ
దడఁబడనీకుండ సత్యధర్మునికొఱకున్

ఇఁక వాయు వనిల మమృతము
ప్రకటశరీరమ్ము నేఁడు భస్మాంతంబై
యకటా! యేమి పొనర్చితి
వి కాయ మప్పుడు స్మరింపవే! యోక్రతువా!

ఓయగ్ని! మంచిత్రోవను
బోవెదు గతి మమ్ముఁ గొంచుఁ బో! వక్రింబా
నేయధ్వ ముడిగి నీకును
భూయిష్ఠంబు నమఉక్తి పొనరింతుమయా!

# శాంతి శ్శాంతి శ్శాంతిః

(నిత్య శతకము : ౧౦ వ పది)

తుర మది శాకయుండ సహసాయతనంబు పొసఁగుచుండు న
తురమునకంటె లోకమున శాశ్వతమం చని యందురే శిలా
తురమది భాగ్యసంస్మృతికిఁ గట్టెను సౌధ మొకండు ప్రేమని
ర్భరుఁడయి వాఙ్మయంబునకు వచ్చిన చే టది లేమి జాతికిన్

నాపసినాఁడు నీవు లలనా! పితృదత్తవు నాకు నేను గా
సి పొసరించి యేయఘుము యెవ్వనినో హరియించి తేను తే
దే పడఁతీ! నినున్ జడము హీనము జాయియు దివ్యమాంధ్రభా
షాపరమోత్తమంబయిన సౌధము కట్టితినే సురాలయా !

ఏతొలినాఁడో సాగరము లేలిన యాంధ్రులభావలోన ప్ర
స్ఫీతత సంస్కృతోత్తులనుఁ బెంచిన యాంధ్రులభావలోన మ
చ్చేతము సొమ్మసిల్ల విరచించిన యీకృతి రాజకీయదు
ర్జాతులదైన యొత్తిడికి సంశయ మందెద నిత్యతాస్థితిన్

గేయయుక్ సార్వముఖీనసృష్టి యయినన్ గీర్వాణసారస్వతం
బునైనం దనయంత శిల్పి కలుగంబోడన్న నన్నయ్య వ్రా
సిన భాషన్ గవియించి యీకృతి పరిక్షీణోచితోత్సాహునై
వనితా! నీస్మృతికావ్యనిత్యతకునై వాయోటమిం గాంచెదన్

బహుసిద్ధాంతవిదూషితంబయిన యీభాషాప్రపంచంబునన్
విహారద్భావరసానుకూలరచనావేశంబు దోసంబుగాఁ
బ్రహరింపంబడి సంశయింపడెద దీవ్యత్త్వన్మహాకావ్యని
గ్రహభీతిన్ గ్రహభీతి శారదికరాకాచంద్రబింబంబు నాన్

చూడను లేని నూతనబుధుల్ జనియించిరి సాగరంబునం
గూడిన యుప్పు వీడ్వరచు కోవిదు లించుక చేయనచ్చు నా
కూడిక వీడ్పు సర్వమునకుం బొనరింపఁగ రాదు నిత్యమై
కూడిన యుప్పులం దెలిసికోరు నిరంతరయత్నధూర్యులై

అయ్యో! సర్వము కుద్దలించెదర యీయజ్ఞానమామూఁక తా
మెయ్యన్ వే యధికారధూర్వహతకై యయ్యాలలున్ గచ్ఛముల్
కయ్యాల్ కోయుటలున్ సరస్వతి భయగ్రస్తాత్మయై గుండెలో
ముయ్యేరైచను శాంతి గావుత మహామోహాబ్ధిపర్యాప్తికిన్